ప్రేమమూర్తికి
సౌందర్యమూర్తికి
దివ్యమూర్తికి.

# తొలి పలుకు

---

సముద్రుఁడు రత్నాకరుఁ డగుటచేఁ బూజ్యుఁడా, లేక భయంకర జలచర సందోహములకు నిలయ మగుటచేఁ ద్యాజ్యుఁడా! —

వర్షాగమనమునకు హృదయానందమా, లేక అశనిపాత ముల యలజడికి హృదయాందోళనమా! —

అనిలుఁడు ప్రాణదాత యని వాంఛనీయుఁడా, లేక ప్రళయ కాల ఝంఝామారుత స్వరూపుఁ డని యవాంఛనీయుఁడా!

---

## పాత్రలు:

వసంతసేన
వసుమతి
జ్యోతిర్మయి
యశోధర
వసుంధర
అనసూయ
వకుళ

విక్రమార్కుడు
అశోకుడు
వృద్ధ సేవకుడు
నిర్మలుడు
కామమోహనుడు
ఆనందుడు
వసంతసేనకొడుకు
పడవవాండ్రు (ఇద్దరు)

# ఆ లోకమునుండి ఆహ్వానము

## ప్రథమాంకము



శ్మశానము. రాత్రిసమయము. ఒకవైపున నొకపుర్రె పడియుండును. విక్రమార్కుఁడు ప్రవేశించును. ఇరువదియయిదు — ముప్పది వత్సరములవయసు లోపువయస్సువాఁడు. చొక్కాయియును, సంచెయును ధరించును.

విక్రమార్కుఁడు :

మనుష్యుడా! మనుష్యుడా! ఎంత దుర్మార్గుఁడవు! ఎంత క్రూరుఁడవు!! [తల వెంట్రుకలు లాగికొనును.] నమ్మినవాళ్లను మోసగించడంలో నీతో సమానమైన జంతువు ప్రపంచంలో మరి ఎక్కడా లేదు. కుక్క తన యజమాని కోసం ప్రాణంఅయినా ఇచ్చేస్తుంది. దానికున్న విశ్వాసంలో, దానికున్న న్యాయంలో వెయ్యోవంతైనా నీకున్నదా? పైపెచ్చు 'కుక్క, కుక్క' అని నీచంగామాట్లాడడం...హూఁ... దుర్మార్గులారా! మీకంటె కుక్కలు వేయిరెట్లు - లక్షరెట్లు - కోటిరెట్లు...ఛీ! మీతో కుక్కల్ని, పోల్చనే కూడదు. ఊళ్లో తిరిగే కుక్కల్ని, పాపం హానిచేయని కుక్కల్ని, నోరెరగని కుక్కల్ని చంపేస్తారే! వాటికన్న మీరెందులో గొప్పని? మిమ్మల్ని ఆవిధంగా ఏరాక్షసుఁడో, ఏదేవతో ఎందుకు నలిపివేసి పారవేయకూడదు? [కోపముతో] హూఁ!

హహాఁ హహా. అలాగే ఎవడైనా మిమ్మల్ని చంపుతూంటే మీ రందరూ గోలపెడుతూ, ఏడుస్తూ ఏమేమి మాటలు పలుకుతూంటారో! అప్పుడు నేనూ, నాలాటి వాళ్ళు ఎవరైనా వుంటే వాళ్ళూ, చూస్తూ, చప్పట్లు కొడుతూ, తాండవం చేయమూ? హాఁ హాఁ హాఁ. [ఆలోచించును.] వద్దు, వద్దు; నేను అటువంటిసమయంలో వుండను; వుండలేను. మీ రెంత అపకారం చేసినా, ఎంత మోసగాళ్ళయినా నాకు మాత్రం జాలివేస్తుంది. జాలి వెయ్యవలసిన అవసరంలేదు. కాని జాలి వేయకమానదు ...ప్రేమ...నా కింక అవసరంలేదు. ప్రేమ నాలో ఎండిపోయింది. నాప్రేమకావలసినవారు లేరు... [నడచును. పుఱ్ఱె కాలికిఁ దగులును. దానిని జూచును.] హా! మను ష్యుఁడా! నీదగ్గర లేకుండా, నిన్ను చూడకుండా, నీగాలి అయినా తగలకుండా, ఒకగంటసేపైనా హాయిగా ఉండాలని వస్తే, ఇక్కడకూడా మళ్లీ నీ ముఖదర్శనమా? [కపాలము చేతి తో నెత్తును.] కాని, నీవిప్పు డేమీ చేయలేవు. [కపాలమును బరీక్షించుచు వికటముగా నవ్వును] ఎంతఅందంగా వుంది? ... ఓ కపా లమా! నీ వెవ్వరో చెప్పు...చెప్పలేవు...చెప్పడానికి నాలు కేదీ? నాలుక లేదు ... లేదు ... అబద్ధాలు చెప్పే నాలుక లేదు. కొండెలుముంచే నాలుక పూడిపోయింది... ఇతరులను నిందించే నాలుక మాయమైపోయింది...చెవు లూ లేవు. పొగుడుతూంటే విని కులకడానికి వీలులేదు. (కన్ను లుండెడిచోట వ్రేళ్ళుపెట్టి) ఇవి నాస్తి. ఇంక ఇతరుల

పెళ్ళాలని ఎలా తేరిపారచూస్తావు ? నీ దొంగభావాలని ఎలా కళ్ళల్లో చూపిస్తావు ? హుః [తల పైఁ గొట్టి] దీనిలో మెదడు లేదు. దుర్మార్గపు ఆలోచనలకు తావులేదు. ఒకళ్లకు అపకారం చెయ్యాలని ఇంక ఏలాగు ఉద్దేశం కలుగుతుందీ ? ...... [నిదానించి చూచుచు] ఆఖరికి నేనుకూడా ఈస్థితి కేకదారా వాలి... [పుర్రెను పారవేయును. సింహావలోకనము చేయును.] అంధకారం. శ్మశానం. నేనొక్కణ్ణి. మనుష్యపురుగు లేదు చూపుమేరంత. [వికటముగాఁజిన్న నవ్వు నవ్వుచు నొకఱాతిపైఁ గూర్చుండును.] నాకు తగినచోటు......

ఒకవ్యక్తి దుప్పటి కప్పుకొని ప్రవేశించును.

వ్యక్తి :

అయ్యా !

విక్రమార్కుఁడు :

[ఒకించుక చకితుఁడై వ్యక్తినిఁ జూచి విసుగుతో] ఇక్కడకూడా నా కీమనుష్యుని బాధ తప్పదా ?

వ్యక్తి :

తమ రెవరు ?

విక్రమార్కుఁడు :

నీ కెందుకు ?

వ్యక్తి :

నేను శ్మశానపాలకుణ్ణి.

విక్రమార్కుఁడు :

శ్మశానానికి పాలకుఁ డెందుకు ? ఇక్కడ ఆస్తి లేదే !

పట్టుకుపోయే వస్తువు లేదే ! ధనవంతుఁడూ లేఁడు. లేని వాఁడూ లేఁడు ఇక్కడ. అంతా బూడిదే !

వ్యక్తి :

అయ్యా! ప్రభుత్వంయొక్క ఆజ్ఞచే ఇక్కడ వున్నాను. నా జీవనోపాధే ఇది......తమ రెవరు ?

విక్రమార్కుఁడు :

నేనా ! నేను ... మనుష్యుణ్ణి.

వ్యక్తి :

అదికాదు...తమ...

విక్రమార్కుఁడు :

నా పేరా ? – విక్రముడు.

వ్యక్తి :

తమ...

విక్రమార్కుఁడు :

ఆగు — నేను అంతా చెప్పేస్తాను. నాకు నీతో మాట్లాడా లని లేదు. వెళ్ళిపో ! నే నొకడికి హాని చేసేవాణ్ణికాను. హాని పొందినవాణ్ణేకాని.

వ్యక్తి :

దయచేసి ...

విక్రమార్కుఁడు :

మర్యాదవద్దు. దానిలో కావలసినంత మాయ వుంది. 'చెప్పు, చెప్పు' అని కఠినంగా అడుగు.

వ్యక్తి :

అయ్యో !...

విక్రమార్కుఁడు :

చెపుతా విను. లేకపోయినట్టయితే నీవు నన్ను విడిచి పెట్టేలాగు లేదు ... నేను ... పూసగుచ్చినట్లు చెపుతా. మధ్యగా మాట్లాడకు. నేను ... నేను ... మాలవాణ్ణి. అస్పృశ్యుణ్ణి. చూడరానివాణ్ణి. మనిషిని అని అయినా తలచ డానికి వీలులేని జాతిలోవాణ్ణి. ఒకప్పుడు ఇంకో స్థితిలో వుండేవాణ్ణి. ఇప్పుడు ధనం లేనివాణ్ణి. ధనం లేదని నీవు నన్నుచూసి జాలిపడవద్దు. నాకు ఈప్రపంచంయొక్క జాలితో పనిలేదు — విను — నాతల్లి చనిపోయింది. నాతండ్రి నన్ను గెంటేశాడు. అతని అభిప్రాయాలూ, నా అభిప్రాయాలూ సరిపడ లేదు. నాకు ఇదివరకు స్నేహితుల్లాగ దొంగ మాటలు చెప్పేవాళ్ళు, ధనానికి నేను దూరంకాగానే, నా దగ్గ రికి రావడం మానేశారు. దొంగలు, వాళ్లందరూ దొంగలు. నీవుమట్టుకు ఎప్పుడూ స్నేహితుణ్ణి నమ్మకుసుమా! నిజ మయిన స్నేహితుడు లేనే లేడు ఈలోకంలో. [కోపముతో నిట్టూర్చును.] ఆఁ. ఎంతవరకు చెప్పేను ?

వ్యక్తి :

“ స్నేహితులందరు విడిచిపెట్టేశారు. ”

విక్రమార్కుడు :

ఆఁ — తరవాత విను. నాభార్య నన్ను విడిచిపెట్టి వేరే వుంది. ఆమె విడిచిపెట్టిందని నేను విచారించడం లేదుసుమా! ఆమెకు ఇష్టంలేనప్పుడు ఎందుకు నాతో వుండాలి? ఆమె ఇంకొకడితో స్నేహంగా వుంది. అతనితో అయినా ఎక్కువకాలం స్నేహంగా వుంటుందని నాకు నమ్మకం లేదు. అయినా నాకు ఆవిషయంతో సంబంధంలేదు...... నాకు ఒకకొడుకు ఉండేవాడు. కొన్నాళ్ళకు దాయాదులు అతన్ని చంపేశారు...... ఇప్పుడు నా అనేవాడు ఎవ్వడూ లేడు. కాని నా అనేవాడు ఉండాలని నేను కోరడంలేదు సుమా! [ ఆలోచించును ] ఆఁ. తరవాత నేను ... ... మావూరినించి ఎన్నోచోట్లకు వెళ్లేను. ఎన్నోకష్టాలు పడ్డాను. ఎక్కడ చూచినా అవిశ్వాసమే. ఎక్కడ చూచినా మాయే! మనుష్యులమీద నాకు నమ్మకంపోయింది. వాళ్ళతో కలసి ఉండడమే నాకు నరకం అయిపోయింది. ప్రపంచంలో అర్థం నాకు కనిపించలేదు. తిరిగేను; తిరిగేను. మనశ్శాంతిమట్టుకు లేదు. మనుష్యుల విశ్వాసఘాతుకత్వం నన్ను దహించేస్తోంది. నేనుకూడ మనుష్యుణ్ణేఅని అనుకున్నప్పుడు కత్తితో పొడిచినట్టుంటుంది. ఒకమాట...... నేను...ఇదివరకు చాలామందికి ఉపకారం చేశాను. వాళ్లే అందరికన్నా నన్ను ముందు విడిచిపెట్టేశారు...చూశావా? ఈలాంటివి అన్నీ అనుభవిస్తే నీకెలావుంటుంది?

వ్యక్తి :

మహాత్మా!

విక్రమార్కుడు :

అదేంమాట ! నేను మహాత్ముణ్ణా ? కాను, కాను. నేను మహాత్ముణ్ణే అయితే ఈసరికి ఒకమాటచేత, ఒక చూపుచేత, ఒకతలపుచేత ఈదుర్మార్గుల్ని, ఈ మనుష్య పందల్ని నాశనంచేసి వుండకపోదునా? ...... కాబట్టి నన్ను మహాత్మా అని పిలవకు. అబద్ధాలూ, దొంగపొగడ్తలూ విని విసిగిపోయివుంది ఈప్రాణం.

వ్యక్తి :

అయ్యా! నేను పొగడాలని మిమ్మల్ని మహాత్మా అని అనలేదు. మీచరిత్ర విని, మీ ఉదార అభిప్రాయాలని గ్రహించి, మీమాటలలోవున్న ఔన్నత్యానికి ఆశ్చర్యపడి మహాత్మా అని అన్నాను. అయ్యో! మీకష్టాలు వింటే రాయి అయినా కరిగిపోతుంది.

విక్రమార్కుడు :

కరిగితే రాయే కరుగుతుంది; కాని మనుష్యుడుమాత్రం కరగడు.

వ్యక్తి :

అయ్యా! నేనేకాని మీస్థితిలో వుంటే, గుండెపగిలి చచ్చిపోయి వుందును.

విక్రమార్కుఁడు :

వెఱ్ఱివాడా ! నా స్థితిలో వుంటే నువ్వూ నాలాగే వుందువు: చచ్చిపోలేవు. చచ్చిపోవాలని వున్నా. చూడు నేను చచ్చిపోవాలని చాలాసార్లు అనుకున్నాను. కాని, ఏదీ చచ్చిపోయానా ? ఊఁ...హుఁ...చావు కోరినా రాలేదు... ఇలాంటిబ్రతుకు బ్రతకడంకంటె చావే మేలుసుమా... చచ్చేక కష్టా లుండవచ్చును. లేకపోవచ్చును. ఈలోకములో మట్టుకు కష్టా లున్నాయి, ఉన్నాయి, లేవేమో అని తలచడానికి వీ లేదీ ?

వ్యక్తి :

నాకు మీమాటలువిన్నకొద్దీ గుండె కరిగిపోతుంది ; కంటి నుండి నీరు కారుతుంది.

విక్రమార్కుఁడు :

నాయనా, నాయనా, నీకు కంటినుండి నీరు కారుతుందా ? నీవు ఏడ్వగలవా ! ఏదీ, ఏదీ నీకళ్లు తడవనీ — [ లేచి సమీపింపఁబోయి ] కాని — నేను అస్పృశ్యుణ్ణికానూ ? తాకవచ్చా ?

వ్యక్తి :

నేనూ ఆ జాతిలోవాణ్ణే ! — కాని —

విక్రమార్కుఁడు :

అయితే ఫరవాలేదు. [కన్నులు స్పృశించి, తనకన్నులకా బాష్పములు రాసికొని ]...అబ్బే — నాకు ఏడుపు రాదు—

నీ కన్నీళ్ళు రాసుకున్నా రాదు. నాలోవున్న నీళ్ళు అయిపో యాయి. ఇదివరకు ఎంతో ఏడ్చాను; ఇప్పుడు ఏడుద్దా మన్నా ఏడవలేను. నీవెంత అదృష్టవంతుడవు! హాయిగా ఏడవాలని వున్నపుడు ఏడ్వగలవు! ఏడిస్తే ఎంతో బరువు తీసినట్టు ఉంటుంది కదూ?

వ్యక్తి :

చిత్తం — తమరు మా జాతివారని నేను నమ్మలేను. ఇంత జ్ఞానం, ఇంత తెలివీ మా జాతిలోవాళ్లకి ఎలా వస్తాయి! నేను చిన్నప్పుడు కొన్నాళ్ళు మాకోసం పెట్టిన పాఠశాలలో చదువుకొన్నా నని మావాళ్ళు నన్ను గొప్ప చేస్తూంటారు. కాబట్టి నాకే ఆశ్చర్యంపుట్టించే అంత తెలివి మాజాతిలో వుండడం చాలా ఆశ్చర్యకరం. నా కేమిటి! మహాపండితుడికి కూడా మీమాటలు ఆశ్చర్యం కలగ జేయక. మానవు — కాబట్టి నిజం చెప్పవలయు నని ఈ దీనుని కోరిక.

విక్రమార్కుడు :

[నవ్వి] వెఱ్ఱివాడా! ఏం, మాలవాళ్లలో బుద్ధిమంతులు ఎందు కుండరు? వాళ్లుమట్టుకు మనుష్యులు కారూ? భగ వంతుడు వీళ్లకిమట్టుకు మెదడు ఇవ్వలేదూ? — విద్య లేక ఈనిమ్నజాతి యీ విధంగా వుందికాని, విద్య యిస్తే వాళ్లుకూడా మహాబుద్ధిమంతులను ఈలోకానికి ఇవ్వరూ? జాతికినీ, బుద్ధికినీ సంబంధము లేదు — ఈ నిమ్నజాతిని

ఈస్థితిలో వుంచిన మిగిలిన జాతులవారి క్రౌర్యంచేతనే దేశాని కిటువంటి స్థితి, ఈదాస్యం, ఈదుఃఖం. ఒక్క మాట — ఒక్కజీవినైనా అణచి, తొక్కించి వుంచినంత కాలం నిజమైన శాంతి మన ప్రపంచంలో వుండదు.

వ్యక్తి :

ఆర్యా! నిజమేకాని, సత్యం చెప్పాలి, తమ రెవరునిజంగా?

విక్రమార్కుడు :

[ఆలోచించి] నేను అబద్ధం ఎప్పుడూ చెప్పను — నేను పుట్టుకచేత క్షత్రియజాతిలో పుట్టినా ప్రస్తుతం పంచములలో ఒకడిని. పంచములని తొక్కి వుంచినంతకాలం నేనుకూడా వాళ్లల్లో ఒకణ్ణిగా భావించుకుంటున్నాను...కాని నీ కింత కుతూహలం ఎందుకు నావిషయమై? — అవును గాని నీ గొంతుక పురుషులగొంతుక వలె లేక స్త్రీకంఠం వలె వున్నది. ఇంతసేపటినుండీ నేను భావోద్రేకంచేత, ప్రపంచంపై కోపంచేతా బాగుగా గమనించలేను. నీవు పురుషుడవేనా?

వ్యక్తి :

[నవ్వి] ఎంతజ్ఞానం వుండిమాత్రం లాభంఏమిటి, స్త్రీపురుష జ్ఞానం లేనప్పుడు?

విక్రమార్కుడు :

నేను పరిహాసం ఆడటంలేదు. నీవు నన్నేదో మోసగించుటకు వచ్చిన వ్యక్తిలాగ కనబడుతున్నావు. నీవు ఎవరైనా నాకేం? నేనిక్కడ వుండను; వెళ్లిపోతాను. [నడుచుచు]

నీతో మాట్లాడాలని లేకపోయినా ఇంతసేపూ తెలియకుండా నే మాట్లాడేను.

వ్యక్తి:

మీరిక్కడి కెందుకొచ్చారో చెప్పి మరీ వెళ్లండి.

విక్రమార్కుఁడు :

ఆహా! — ఇదేమిటి — ఈనాడు ? నేను నా యింటినుండి విహారంకోసం నడుస్తూ మనుష్యులు లేని ఈశ్మశానంలో కొంచెంసేపు కూర్చుందా మని వచ్చేను.

[నిష్క్రమింపఁబోవును.]

వ్యక్తి:

[సమీపించి, ముఖము వీక్షించి] నేను పురుషుణ్ణి కాను. స్త్రీని ? [ముసుఁగు తీసివేయును.]

విక్రమార్కుఁడు :

[చూడకయే] నీ వెవ్వరైతే నా కెందుకు ?

[నిష్క్రమింపఁబోవును.]

వ్యక్తి:

[కాళ్ళపైఁ బడును.]

విక్రమార్కుఁడు :

[అదరిపడి, ఆగి] ఇదేమిటి ? లే, లే.

వ్యక్తి :

[లేచి] విక్రమార్కా ! నేను జ్ఞాపకం అయినా లేనా !

విక్రమార్కుఁడు :

[ముఖము వీక్షించి, ఆశ్చర్యముతో] వసంతసేనా !

వసంతసేన :

విక్రమార్కా ! జ్ఞాపక మున్నందుకు నాకు చాలా ఆనందంగా వుంది. కాని నీవు మనవూరు విడిచిపెట్టి వెళ్ళిపోయినప్పుడు ముందు ఒక్కమాటైనా నాతో చెప్పకుండా ఎందుకు వెళ్లిపోయావ్రా ?

విక్రమార్కుడు :

నేను ఎవ్వరితోనూ ఏమీ చెప్పలేదు ఎందుకు చెప్పాలి ? చెప్పితేమట్టుకు ఆర్చేవారూ, తీర్చేవారూ ఎవరు ? మనుష్యులు ద్రోహులు ; వాళ్ళతో నాకేం పని ?

వసంతసేన :

నేనుకూడా అందరివంటి దాన్నేనా ?

విక్రమార్కుడు :

నీవుమట్టుకు మనుష్యులలోనిదానవు కావ్రా ?

వసంతసేన :

కావచ్చును. కాని నేను ద్రోహురాలినికాను. అయినా అందరూ దుర్మార్గులని చెప్పడం ఏలా ? ద్రోహులున్నారు. కాని మంచివాళ్ళుమట్టుకు లేరా ?

విక్రమార్కుడు :

ఉండవచ్చు, లేకపోవచ్చు; నాకు వాళ్ళతో సంబంధంలేదు. వాళ్లయందు నమ్మకం లేదు.

వసంతసేన :

కాని నేను నిజమైన స్నేహితురాల నని నమ్ము.

విక్రమార్కుడు :

నాకు స్నేహంతో పనిలేదు. నాకు రావలసిందీలేదు, పోవలసిందీ లేదు.

వసంతసేన :

పోనీ, నీకు స్నేహంతో అవసరం లేకపోవచ్చు, కాని నేను మట్టుకు నా స్నేహాన్ని నీవు కోరకపోయినా ఇస్తున్నా — విక్రమార్కా ! నీవు ఈవూరు వచ్చి ఎన్నాళ్లు అయింది ? ఎక్కడున్నావు ? నీజీవనం ఎలా గడుస్తుంది ? నీకు చెప్పడం ఇష్టం లేకపోయినా పూర్వస్నేహాన్నిపట్టిఅయినా దయచేసి చెప్పు.

విక్రమార్కుడు :

ఈపట్టణం కొద్దిరోజుల క్రిందటనే వచ్చాను. ఒక గది తీసుకొని దాంట్లోనే వుంటున్నాను. నాతండ్రి నన్ను గెంటేసి నప్పుడు నా దగ్గర రెండువందల రూపాయి లున్నవి. అవి అన్నీ ఖర్చయిపోయాయి. మాఅమ్మ నాకు చిన్నప్పు డిచ్చిన వజ్రాలలింకు లుంటే అవి అమ్మి ఆ డబ్బుతో నిన్నటివరకు కాలక్షేపం చేశాను. ఇప్పుడు నాదగ్గర అంతా అయిపోయింది. నే నున్నగదికీ, భోజనానికీ వారానికి ముందే డబ్బిచ్చేను. రేపటితో వారం అయిపోతుంది.

వసంతసేన :

తరవాత ఎట్లా ?

విక్రమార్కుడు :

నాకు తెలియదు.

వసంతసేన :

ఏం చెయ్య దలచుకొన్నావు ?

విక్రమార్కుడు :

ఏమీ చేయ దలచుకో లేదు.

వసంతసేన :

నువ్వు అంతజ్ఞానివి ఏమీ లేకుండా ఎల్లా వుండదలచుకొన్నావు ? అందులో ... ప్రపంచంలో నీకు చెయ్యడానికి పనే లేదా ? అందులో నీవు విద్యావంతుడవు —

విక్రమార్కుడు :

ఈకాలాన్ని ప్రపంచంలో జ్ఞానం, నిజమైన సమర్థత, నిజమైనవిద్య పనికిరావు. అదీకాకుండా నేను మనుష్యులతో కలసి వుండలేను. విసుగు పుట్టిపోయింది — అన్నం లేక పోతే ఎలాగ అని నువ్వు ఆశ్చర్యపడుతున్నావేమో, ఆశ్చర్య పడవలసిన పనిలేదు. అన్నం లేక కృశించి కృశించి చచ్చిపోతాను; నాకోసం ఏడ్చేవాళ్ళయినా వుండరు.

వసంతసేన :

నేను నీ మాటలు ఇంక వినలేను. [ముఖమును చేతులతో మూసికొని దుఃఖించును. ]

విక్రమార్కుడు:

[ అంధకారమును జూచుచుండును. ]

వసంతసేన :

[ శోకావేశంతో ముఖముం దుడుచుకొని ] విక్రమార్కా ! నువ్వు మనపట్టణాం విడిచిపెట్టి వెళ్లిపోయావని వినగానే నాకు

పిడుగు పడినట్లయింది. నీకొచ్చిన కష్టాలకి నే నెంత ఏడ్చానో ఆ భగవంతుడికే ఎరుక — సరే, దానికేమి, తర వాత నే నింక మనవూళ్ళో వుండలేకపోయాను. ప్రపంచం ఏ మనుకున్నా సరే అని నీకోసం ఎన్నెన్ని వూళ్ళో తిరి గేను, వెఱ్ఱి ఆశతో. నిరాశకూడా అయింది; తుదకి ఈ వూరు వచ్చాను. నే నద్దెకు తీసుకున్న గృహంయొక్క యజమానికి నీ ఛాయాపటం చూపించి ఇటువంటి మనిషి ఈవూళ్లో ఉన్నాడేమో అని కనుక్కో మన్నాను. అతడు సందేహిస్తూ, "దృఢంగా చెప్పలేను, కాని ఇలాంటివాడే వొకడు ఈవైపునే రెండుమూడుసార్లు వెళ్ళినప్పుడు చూచి నట్లు జ్ఞాపకం" అన్నాడు. హృదయం పొంగిపోయింది; నేనూ చూద్దా మని కూర్చున్నా. చాలా సేపటికి నువ్వు వచ్చావు. కాని, చీకటిలో నిన్ను బాగా ఆనవాలు పట్టలేక పోయాను; అనుమానంమట్టుకు చాలా కలిగింది. సరే ఏమైతే అయిం దని నిన్ను ఆపా లని వీథిలోకి త్వరగా వచ్చాను. అప్పుడే నువ్వు దూరం ఐపోయావు. అక్క డింక వుండలేక నిన్ను వెంబడించాను. కాని, నీతో నడవలేక పోయాను; కొంతసేపటికి నువ్వు కనిపించనే లేదు — ఏం చెయ్యాలో తోచిందికాదు. కాని వెళ్లేది నువ్వే అని ఎంచేతో నాకు మనస్సులో ఏదో చెప్తూతోంది — అప్పుడు నాచేతులో వున్న 'టార్చి' వెలుగులో నీ అడుగులు కనిపించాయి. ఎవరూ సాధారణంగా వెళ్ళనిచోటు; అందులో అప్పుడే

నేను ఎంత ప్రేమించానో మాటల్లో చెప్పలేను. నిన్ను చూడకుండా వుండలేకుండేదాన్ని ఒక్కరోజైనా; ఇలాంటి స్థితిలో నీకోసం ఏడ్చానంటే చిత్రంఏముంది? నువ్వు లేకపోతే నాకు ఈబ్రతుకే చావు; నువ్వులేని స్వర్గం నాకు నరకం. నువ్వుంటే నరకమే నాకు స్వర్గం. ఇప్పుడైనా తెలిసిందా ఎందు కేడ్చానో!

విక్రమార్కుఁడు:

నువ్వు నన్నెందుకు ప్రేంమిచావూ? ప్రేమించవొద్దు.

వసంతసేన:

ఎందుకుప్రేమించావని ప్రశ్నా! ఆహా! — ప్రేమకి కారణం ఏముంది? కారణంలేని ప్రేమే ప్రేమ...ఆఁ — ప్రేమించవద్దని అన్నావు: ఎలా అనగలిగావు? ప్రేమించవద్దని అన్నంత మాత్రాన్నే ప్రేమించడం మాన్తానా? మానగలనా, మాని వేద్దా మన్నాను?

విక్రమార్కుఁడు:

నేను నిన్ను ప్రేమించడం లేదని నువ్వింకా అనుకోడం లేదూ?

వసంతసేన:

[నివ్వెరపడి చూచును.]

విక్రమార్కుఁడు:

నువ్వింక వెళ్ళిపో; ఐపోయింది కాదూ?

వసంతసేన:

ఏమి టయిపోయింది? ఏమీ అయిపోలేదు. నువ్వు నన్ను

వర్షం కురిసి వెలిసింది. అడుగులు చాలా బాగా కనిపిం చాయి. వాటి ఆధారంతో ఇక్కడికి వచ్చాను; నీ వ్యక్తి కనిపించింది. కాని, నీరూపు కనిపించలేదు. ఒకవేళ నువ్వు కాదేమో అని భయంకూడా కలిగింది. అందులో నువ్వు చాలా చిక్కిపోయి వున్నావు. ఏం చెయ్యను? — సరే ఏమైతే అవుతుందని నిన్ను పలకరించాను. నీ గొంతు విన్నాను. సంతోషం వచ్చింది. కాని నీకు దగ్గరగా రా ముందు నువ్వే అని స్థిరంగా తెలిసికోవాలని నిన్ను ఇన్ని ప్రశ్న లేశాను. ఎంచేతంటే గొంతుకనుబట్టి స్థిరపరచడ కష్టం అని.

విక్రమార్కుడు:

కాని శ్మశానపాలకుణ్ణి అని ఎందు కన్నావు నాతో?

వసంతసేన:

ఒకవేళ నువ్వు కాకపోతే నే నెవరినో తెలియకుండా వుండా లని. దానికి సహాయంగా నీకోసం ఏడ్చి ఏడ్చి నా గొంతుక బొంగురుపోయిందికూడాను.

విక్రమార్కుడు:

నువ్వు నాకోసం ఎందుకు ఏడ్చావు?

వసంతసేన:

ఎందు కేడ్చానా? విక్రమార్కా! నీవింతబుద్ధిమంతుడవై వుండికూడా ఇలాంటి ప్రశ్నేమిటి? నీకు తెలియదూ? అయ్యో! — పోనీ విను చెపుతాను నీకు. నిన్ను ప్రేమించాను.

విక్రమార్కుఁడు :

తెలియదు.

వసంతసేన :

నువ్వు చాలా తెలివిగలవాడవు; నిన్ను నేను ఎంత ప్రేమించినా ఒకొక్కప్పుడు నీకు నేను తగనని అనుకునేదాన్ని. నిన్ను నేను ఒకొక్కప్పుడు నాకు గురువుగా తలచుకొని, మహాత్ముడవని భావించుకుంటూంటాను. కాని నీకుమట్టుకు ఒక దుర్గుణం వుంది; కోపగించకు; నీవుపట్టిన కుందేటికి మూడే కాళ్ళంటావు.

విక్రమార్కుఁడు :

నాకు కోపం లేదు; నిజం చెప్పేవు.

వసంతసేన :

క్షమించు — విక్రమార్కా! నేను ప్రార్థిస్తున్నా; నువ్వు వచ్చి నాతో వుండు. నాదగ్గర లేకుండా వుండిమట్టుకు నువ్వేమి చేస్తావు ?

విక్రమార్కుఁడు :

[మౌనము]

వసంతసేన :

నువ్వు బిచ్చమెత్తుకుంటూంటే నేను చూస్తూ వూరుకోగలనా?

విక్రమార్కుఁడు :

నేనుమట్టుకు బిచ్చ మెత్తను. ఎందుచేతంటే, దుర్మార్గుడైన మనుష్యునిదయ నాకు అక్కరలేదు. అసలు నిజమైన దయేలేదు.

ప్రేమించడం లేదని విన్నప్పుడు ఒక్కనిమిషంనిర్ఘాంతపోయాను. కాని, నా ప్రేమమట్టుకు కొంచెమైనా తగ్గలేదు. పోనీ, నువ్వు నన్ను ప్రేమించకపోయినా నేను మాత్రం నిన్ను ఎప్పటి మోస్తరుగానే ప్రేమిస్తున్నానని గ్రహించు; అంతే చాలు.

విక్రమార్కుడు :

అబ్బా! శ్మశానంలోకూడా ఈప్రేమగోడవేనా? ప్రేమకి యుక్తాయుక్తాలు లేవు.

వసంతసేన :

విక్రమార్కా! నిజమే. ప్రేమకి యుక్తాయుక్తా లుండవు. శ్మశానంలో కూడా ప్రేమగోడవ తప్పదా అన్నావు; ప్రేమకి స్థలంలేదు; కాలంలేదు ... అయ్యో! నువ్వు ప్రేమించడం అంటే ఏమిటో మరిచిపోయావే!...పోనీ, ఆసంగతి ఇప్పు డెందుకు? కాని, విక్రమార్కా! నువ్వు నాతో వచ్చి నివసించ కూడదూ?

విక్రమార్కుడు :

ఎందుకూ?

వసంతసేన :

నాకోసం.

విక్రమార్కుడు :

నేను రాను.

వసంతసేన :

మరి ఎక్కడ వుంటావు?

వసంతసేన :

అలా కాదు: ప్రపంచంలో క్రూరులూ వున్నారు: ప్రేమ మయులూ వున్నారు. దయామయుడైన ఈశ్వరునిసృష్టిలో కరుణయే వుండదా ?

విక్రమార్కుడు :

ఈశ్వరుడు దయామయుడా ? ...ఏదీ ఈశ్వరుని దయ ? నా కొడుకుని, నోరులేని చిన్నపిల్లడిని గొంతుక నులిమి చంపుతున్నప్పు డీ ఈశ్వరునిదయ ఏమయింది? నా తల్లి మరణశయ్య మీద బాధ పడుతున్నప్పుడు దయామయుడైన ఈశ్వరు డేమి చేస్తున్నాడు ? నేను దిక్కులేక తిరుగుతున్నాను; భగవంతు డేమిదయ చూపిస్తున్నాడు ? భగవంతుడు దయామయుడు కాదు; అత డొకశక్తి; భయంకరమైన, క్రూరమైన శక్తి.

వసంతసేన :

[తన యసమ్మతిని జూపుచుఁ దలను త్రిప్పును.]

విక్రమార్కుడు :

[శిలాప్రతిమవలె స్తబ్ధుఁడై యుండును.]

వసంతసేన :

[మెల్లఁగా నతని భుజస్పర్శము చేసి] చూడు, విక్రమార్కా—

విక్రమార్కుడు :

[ఆదరిపడి] పిలిచావా ?

వసంతసేన :

[మిక్కిలి యాందోళనముతో] అయ్యో...ఏమి టిది ?

విక్రమార్కుఁడు :

ఏమిటీ ?

వసంతసేన :

ఏమీ లేదు, కాని ఒకమాట విను — నువ్వు నాతో వచ్చి నాదగ్గర ఊరికే వుండడానికి ఇష్టపడడం లేదేమో, పోనీ నాకు కార్యదర్శిగా వుండు.

విక్రమార్కుఁడు :

[ఆలోచన]

వసంతసేన :

నిన్ను కార్యదర్శిగా వుండమనడానికి నాకే సిగ్గుగావుంది. అంత ఆగర్భశ్రీమంతుడవు ...

విక్రమార్కుఁడు :

[అడ్డువచ్చి] ఇప్పుడు మహాదారిద్ర్యచక్రవర్తిని.

వసంతసేన :

నా హృదయచక్రవర్తివి.

విక్రమార్కుఁడు :

[మౌనము]

వసంతసేన :

నాతో రా. నా సర్వస్వమూ నీదే ; నన్ను ఆజ్ఞాపించు.

విక్రమార్కుఁడు :

నేను రాను.

వసంతసేన :

పోనీ వట్టినే రావొద్దు. నా కార్యదర్శివిగా రా. లేకపోతే ఇలా కృశించి ఉపవాసాలతో నశించిపోతావా ?

విక్రమార్కుఁడు :

గాంధిమహాత్ముడు ఉపవాసాలు చెయ్యడం లేదూ !

వసంతసేన :

లోకోపకారంకోసం ఆతడు ఉపవాసాలు చేస్తున్నాడు; నువ్వు ఎవరికోసం ? ... ఇలాంటి ఉపవాసాల వల్ల వచ్చేది ఆత్మహత్యామహాపాపంవల్ల వచ్చే ఫలమే !

విక్రమార్కుఁడు :

[మౌనము]

వసంతసేన :

[ఉద్రేకముతో] నువ్వు పురుషుడవు; వీరుడవే. చేతకాని తుచ్ఛజీవిలాగ నశించిపోతావా ? నువ్వు యిలా నశించిపోతే నీ శత్రువులైన మనుష్యులకు మరీ సంతోషంకాదూ !

విక్రమార్కుఁడు :

[ఉద్రేకము నడఁచుకొనుచుఁ దలఁ ద్రిప్పును.]

వసంతసేన :

క్షమించు ... కాని, నాతో రా.

విక్రమార్కుఁడు :

సరే, నీ కార్యదర్శిగా వస్తా.

వసంతసేన :

[ మహానందముతో ] హాఁ ! — ఎంత సంతోషం... రా వెడదాం.

విక్రమార్కుఁడు :

నాకు నువ్విచ్చే జీతంతోటే నేను జీవిస్తాను. కాని నువ్వు నాచేత జాలిపడకుండా పూర్తిగా పని చేయించుకో : నేను ఇతరులదయ కోరను.

వసంతసేన :

సరే, అలాగే చేయిస్తానులే.

విక్రమార్కుఁడు :

ఇన్నాళ్ళకి నాకు దాస్యమా ! ......ఫరవాలేదు. దీనిలో తప్పు లేదు. స్వాతంత్ర్యం వుండిమాత్రం ఏంచెయ్యగలిగాను ?

వసంతసేన :

రా.

విక్రమార్కుఁడు :

వస్తున్నా. రాకతప్పదు. కాలపురుషు డీడుస్తున్నాడు. ఇంకా కొన్నాళ్లీ ప్రపంచబాధ అనుభవించక తప్పదు కాబోలు.

వసంతసేన :

రా మరి, వెడదాం.

విక్రమార్కుఁడు :

చిత్తము.

వసంతసేన :

నా కార్యదర్శి నన్ను ఇదివరకు చేయ్యాలి మన్ననలు చెయ్యడం నా కిష్టం లేదు.

విక్రమార్కుఁడు :

[ఊరకుండును.]

[ఒక నక్క కూయును.]

వసంతసేన :

[భయముతో] విక్రమార్కా ! భయం వేస్తోంది. నా చెయ్యి పట్టుకో.

విక్రమార్కుఁడు :

[సందేహముతో నట్లు చేయును.]

వసంతసేన :

నన్ను త్వరగా పురానికి తీసుకొని వెళ్ళు ; అలసిపోయాను. నుంచోలేను, ఎక్కువసేపు.

విక్రమార్కుఁడు :

[నడిపించును.]

వసంతసేన :

[కన్నులు మూసికొని నడచును. కాలి కేదియో తగులుటచేఁ బడఁబోయి విక్రమార్కునిచే నాఁపఁబడును.]

విక్రమార్కుఁడు :

చాలా బలహీనంగా వున్నావు : కొంచెంసేపు కూర్చుంటావా ?

వసంతసేన :

అక్కరలేదు. నాకు ఆనందమే బలాన్నిస్తుంది. నిన్ను చూడ గలిగినందుకు భగవంతుడికి సమస్కారము లర్పిస్తూ కళ్ళు మూసుకోవడంచేత దారి చూసుకోలేదు.

విక్రమార్కుడు :

నేను ప్రార్థనచేసి చాలారోజు లయింది.

వసంతసేన :

[ప్రశ్నార్థకముగ నతని వైపుఁ జూచును.]

విక్రమార్కుడు :

ప్రార్థన చెయ్యాలని చాలాసార్లు ప్రయత్నిస్తాను కాని, లాభం లేకపోతూంది. సరిగ్గా ప్రార్థన చెయ్యలేకపోతున్నా.

వసంతసేన :

[కనులు తుడుచుకొనును.]

విక్రమార్కుడు :

[చూడనట్లు నటించును.]

వసంతసేన :

చూడు, నువ్వు శ్మశానంలోకి ఎందుకొస్తున్నావు?

విక్రమార్కుడు :

ఇక్కడ మనుష్యసంపర్కం వుండదని. అదీ కాకుండా ఇక్కడ మనుష్యుణ్ణి కాల్చేస్తా రని.

వసంతసేన :

[తల పంకించుచు] నేను గ్రహించగలను...

విక్రమార్కుఁడు :

గ్రహించలేవు.

[ ఇద్దరు నిష్క్రమింతురు ]

[ తెరలో ]

విక్రమార్కుఁడు :

నీ భర్త విదేశాన్నుండి వచ్చాక ఏ మంటాడో ?

వసంతసేన :

ఏ మనడానికీ ఏ ముంది? అయినా ఇదివరకు ఎన్నిసార్లు నువ్వు మాయింటికి రాలేదు ! ఆయన సంతోషిస్తారు.

నిశ్శబ్దము — ఒక మెఱపు మెఱయును ; ఒకకపాలము స్పష్టముగఁ గనఁబడును. పిదప సర్వము గాఢాంధకారము.

తెర

# ఆ లోకమునుండి ఆహ్వానము

## ద్వితీయాంకము



ప్రదేశము : వసంతసేన సౌధములోని యొక విశాలమందిరము. అశోకునియొక్కయు, వసంతసేనయొక్కయు ఛాయాపటము లెదురెదురుగఁ జెరి యొక గోడకుఁ దగిలింపఁబడియుండును. రెండుసోఫాలు, నాలుగు కుర్చీలు, మూఁడునాలుగుబల్లలు, రెండు పెద్ద యద్దములు యథాస్థానములయం దుండును.

ప్రవేశము : రూపవతియు, యౌవనవతియు నగు పరిచారికయు, వయస్సు మరలిన పరిచారకుఁడును వస్తువుల నమర్చుచుందురు.

పరిచారిక :

[ తుడుచునట్టిగుడ్డను బరిచారకునిపై విసరును. ]

పరిచారకుఁడు :

[ కోపముతో ] వసుమతీ ! ఏమి టీ అల్లరి ?

వసుమతి :

[ కిలకిల నవ్వును. ]

పరిచారకుఁడు ;

నీకు సిగ్గు లేదూ ?

వసుమతి :

సి గ్గెందుకూ ? [ నవ్వును. ]

పరిచారకుఁడు :

ఔను, సి గ్గెందుకు ? ఈకాలంలో అలాంటి వేవీ వుండనే

వుండకూడదు కాదూ !

వసుమతి :

కాని, మామా!...

పరిచారకుఁడు :

అదేమిటి ? నీకు నేను మామ నెలా అయ్యాను ?

వసుమతి :

ఔనుసుమా, నీకు కొడుకు లెవరూ లేరు కాదూ పెళ్ళి కానివాళ్ళు ? ... ... పెళ్ళి అయినవాళ్ళకి ఇంటిదగ్గర దెయ్యాల్లాగ పెళ్ళా లుంటారు ; అక్కడ మన ఆటలేవీ సాగవు ! [నవ్వు]

పరిచారకుఁడు :

ఇ దేమి మాటలే !

వసుమతి :

పోనీ, బావా ! [నవ్వును.]

పరిచారకుఁడు :

చెస్, ఊరుకో.

వసుమతి :

లోపల కులుకుతూన్నప్పటికీ, పైకిఇలా అనాలి సమయం వచ్చిందాకాను ; మీముసలివాళ్ళకున్న పొయ్యేకాలమే ఇది !

పరిచారకుఁడు :

నీలాంటి ముండిదానికి దేవుడైనా జవాబు చెప్పలేడు — కాని, నీ కెపడోగాని మొగుడు, వాడిఖర్మం కాలిందన్న మాటే!

వసుమతి :

నాకు పెళ్లి చేసుకునేఖర్మం ఇంకా రాలేదులే !

పరిచారకుఁడు :

ఔను. పెళ్ళెందుకు ? ... [సామగ్రి సర్దుచుండును.]

వసుమతి :

[తానుగూడ సర్దుచు] కాని, పెళ్ళయిందాకా మీలాంటి ముసలిముండాకొడుకు లూరుకుంటారా ? లోకంలో ఎవడికి పెళ్ళవలేదన్నా మీకే బెంగ !

పరిచారకుఁడు :

పోనీ, ఏమి చెప్పినా పడుచువాళ్ళు మామాటవింటారు గనకనా ?

వసుమతి :

వినవలసిన .అవసరం ఏముంది ? పడుచువాళ్ళు పసిపిల్లలు కారే ! వాళ్ళకి బ్రతికున్నంతకాలమూ మీముసలాళ్ల పోరు తప్పదుకాబోలు ; వాళ్లని సుఖంగా వుండనివ్వరు. నేను మట్టుకుమాత్రం ఎవ్వరిమాటా వినదల్చుకోలేదు.

పరిచారకుఁడు :

అందుకే, మహానుభావురాలవు చిన్నప్పుడే తల్లిదండ్రుల్ని ఈలోకంనించి పంపించేశావు !

వసుమతి :

వాళ్ళు స్వర్గంలో వుండి వుంటారు.

పరిచారకుఁడు :

నీలాంటి కూతుర్లుంటే స్వర్గంలోంచి నరకంలోకి తోసేస్తారు.

వసుమతి :

అబ్బే, నాలాంటిదే నరకాన్ని స్వర్గం చేస్తుంది ! [నవ్వును.]

పరిచారకుఁడు :

[విసుగుతో] నా కీ గొడవ ఏమిటి ? [పని చేసికొనుచుండును.]

వసుమతి :

చూడూ, నువ్వు నన్ను పెంచుకోకూడదూ ?

పరిచారకుఁడు :

ఈ నెత్తికోతలదానవి నా కెందుకూ ? కొరవితో తల గోక్కున్నట్టుంటుంది. నాకు పిల్లలులేకపోవడమే అదృష్టంలాగ కనిపిస్తుంది చూస్తే.

వసుమతి :

ఏం ?

పరిచారకుఁడు :

ఏమా ? వాళ్ళున్నంతకాలమూ నన్ను నాలుగు సముద్రాలనీళ్ళూ తాగించారు. వాళ్ల చదువులకోసమని వున్న ఆస్తి అంతా అమ్మేసి నానాపాట్లూ పడ్డాను. చిన్నప్పటినించీ పెంచాను ; పెద్దవాళ్లని చేశాను. తీరా సమయంవచ్చేప్పటికి నా కక్కరకు వచ్చేవాడు ఒక్కడూ లేడు.

వసుమతి :

ఏ మయింది ?

పరిచారకుఁడు :

బియ్యేలో ఏదో అయ్యారని గొప్పతప్ప బిచ్చం ఎత్తి

కోడానికి శక్తి లేదు. ఒక్కడూ ఇంటి కొక చారెడుబియ్యం తేలేడు. పైపెచ్చు ఇంటిదగ్గర కూర్చుని సినీమాలకనీ, టెన్నిసు బేట్లుకనీ డబ్బుకోసం ప్రాణాలు వేధించుకుని తినేసేవారు; ఇవ్వనంటే వెధవకోపం — వాళ్ల బాబుగారి సొమ్మున్నట్టు...

వసుమతి :

[నవ్వుచు] నువ్వు వాళ్ళబాబువుకాదూ మరి ?

పరిచారకుఁడు :

అందుకే నా ఖర్మం కాలింది.

వసుమతి :

తరవాత —

పరిచారకుఁడు :

తరవాత ఏముంది ? నానా రచ్చాను. ప్రతీ పనికిమాలిన గొడవా వాళ్లకే కావాలి — ఊళ్ళో వెధవముండలికి పెళ్లంటే వీళ్ళకే ముందు హడావిడి. బోగంవాళ్ల ఇళ్ళకి వాళ్ళకి పెళ్ళిళ్ళు చేసే వంకమీద తరుచు పోవడం ;— అంతేకాని చేసుకున్న సంసార్లని బుద్ధిగా వుండమని చెప్పడంకాదు ; అలా చెప్పడం వాళ్లస్వాతంత్ర్యానికో, వల్లకాడుకో అడ్డట. ఒకటా గాడిద గత్తర. ఇంకొకటి: మాలాళ్ళతో కలిసి నానా గత్తరకూడూ తినడం. ఇంకో ముప్పుకూడాను. ఏదో స్వరాజ్యంట. దాని కోసం మీటింగులు. దానికి వీళ్లే పెద్దలు. వాటిల్లో కొంత సేపు మొరిగి పోలీసువాళ్ళు చావతంతే అప్పుడు ఇంటిమొహం పెట్టడం.

వసుమతి :

అయితే, నీ కొడుకులు చాలా దేశసేవకు లన్నమాట !

పరిచారకుఁడు :

ఆ, నువ్వు మెచ్చుకోవాలి వాళ్లని. తినడానికి తిండి తెచ్చుకోలేని నిర్భాగ్యులు దేశాని కేదో కొండమీదనించి తెస్తారుట!... నేను, ఎందుకురా మీకీగొడవ, సంపాదించకపోతే పోయేరు, వూరికే తిని కూర్చోకూడదా అంటే కస్సుమని లేవడం. అక్కణ్ణించి సత్యాగ్రహంట; అన్నంమానెయ్యడం.

వసుమతి :

వాళ్ల కడుపే మాడుతుంది కాదూ, నీకేం కష్టం ?

పరిచారకుఁడు :

అన్నం మానేస్తే బియ్యం ఖర్చు తగ్గినా చాటుగుండా వెళ్లి కాఫీహోటళ్లమీద పడితే ఆఖర్చు నాకు అయిదురెట్లెక్కువ అయేది. ఒకటా రచ్చ : రామ, రామ ! పిల్లలులేని వాడిదే సుఖం.

వసుమతి :

[ఆక్షేపణ పూర్వకముగ.] కొడుకులు లేని వాళ్లకి పున్నామ నరకం వొస్తుందిట కాదూ ?

పరిచారకుఁడు :

ఆబాధయినా పడొచ్చుగాని ఈ పున్నామనరకం బాధ పడలేము. మహాపాపం చేసుకుంటేనే పిల్లలుపుడతారు.

వసుమతి :

తరవాత ఏమయింది ?

పరిచారకుఁడు :

ఏముంది, గొడవ ఎక్కువైపోయింది. వాళ్లకి పెళ్లిచేసేస్తే ఈహడావిడి తగ్గుతుం దని ఆలోచిస్తే, ఊఁ హుఁ, అదీ సాగలేదు. ఏదో ప్రేమట; ప్రేమించాలట — అప్పుడే పెళ్లట !

వసుమతి :

మరి, ప్రేమించకుండా పెళ్లి ఎలాగ ?

పరచారకుఁడు :

అదే వచ్చిన చిక్కు. మేమందరమూ ప్రేమించే చేసుకున్నామా పెళ్ళిళ్లు ? చేసుకున్నాక ఇష్టంగా కాపరాలుచేసుకోడం లేదూ ?

వసుమతి :

మీకేమీ పేచీలు లేకుండానే వున్నారా మరి ?

పరిచారకుఁడు :

ప్రేమించి చేసుకున్న తలతిక్కశంకరయ్యలు మాత్రం గొడవలు లేకుండా వున్నారా ? వాళ్ల వైభోగం చూస్తున్నాం కాదూ ?

వసుమతి :

వుండొచ్చు. ఆముప్పు అసలు పెళ్ళిలో వుంది ; పెళ్ళికీ సుఖానికీ సంబంధం లేనే లేదు. అంచేతే నేనుపెళ్ళి చేసుకోదల్చుకోలేదు. (నవ్వును) ఏప్పుడైతే ఈపెళ్ళిళ్లబాధ పోతుందో

అప్పుడే ఈ లోకంలో సుఖం ; అక్కత పరకూసుఖంనున్న...

పరిచారకుఁడు :

ఆహా! ఏమిసీతి అండీ! నీలాంటి వాళ్లందరూ కలిస్తే కొత్తగా శాస్త్రాలని పుట్టించరూ? అంతవరకూ ఎందుకు, ఇప్పుడు పుట్టించడం లేదూ? ఏ అనుకణీవక వ్రాతన్నా సరే, మేము మంచి దనుకొన్నదాన్ని తిడితే అదొక గొప్పవ్రాత! రంకుతనం మంచి దని వాగితే, ఓ — వాడొక బ్రహ్మ అన్న మాటే!

వసుమతి :

ఏదీ, మమ్మల్ని వ్రాయనిస్తేగా పూర్తిగా?... సరే, దాని కేం గాని మరీ — ఆఁ — జ్ఞాపకం వచ్చింది; ప్రేమించి పెళ్ళి చేసుకున్నవాళ్ళు మాత్రం సుఖంగా వున్నారా అన్నావు నువ్వు — లేకపోవచ్చు, కాని అది వాళ్ల ఖర్మం. ఎవడు చేసుకున్నదానికి వాడే బాధ్యుడు. అప్పుడు వొకళ్ల మీద నింద మోపడానికి వీల్లేదు. స్వేచ్ఛలో వున్న కష్టాల్లో ఇదొ కటి. అలాగని స్వేచ్ఛలేకుండా చెయ్యడానికీ వీల్లేదు — వాళ్ళ కిష్టమయిన వాళ్లని వాళ్ళు చేసుకుంటారు; సుఖమో కష్టమో అనుభవిస్తారు. పెళ్లిచేసుకునేది వాళ్ళా మీరా?

పరిచారకుఁడు :

ఊఁ, కానీ, నీకు అడ్డు ఏముంది?

వసుమతి :

అడ్డుంటే మట్టుకు నే నాగుతానా? విను — ఎవడూ గోతు

లోకి దిగాలని దిగడు. ఖర్మం చాలక పడితే, ఎలాగా పడతాడు కదా అని వాణ్ణి గోతులో తొయ్యడం ఎలా అధర్మమో అలాగే – వచ్చేది రాక తప్పదని, ఇష్టం లేకుండానో, లేకపోతే ఇష్టం లేకపోయినా ఇష్టం వుందని అబద్ధం ఆడించో పెళ్ళి చేయించడం మహాపాపం. ఇలాంటి విషయాల్లో పెద్దవాళ్ళకి కొంచమైనా హక్కు లేదు.

పరిచారకుఁడు :

కాని ఆ పెద్దవాళ్ళ ఆస్తికిమట్టుకు పిల్లలకి హక్కు వుండాలీ?

వసుమతి :

ఆఁ, వాళ్ళు మాత్రం ఆ ఆస్తి ఎలా సంపాదించారో? తాతలనుంచి తండ్రులకీ, వాళ్ళనుంచి పిల్లలకీ –

పరిచారకుఁడు :

[ఏదియో సరిచూచుచుండును.]

వసుమతి :

[సోఫాకు ఆనుకొని క్రిందఁగూర్చుండి] కోపం వొద్దు. కాని, నీకొడుకులసంగతి చెప్పవూ! మిగిలింది ఏ మయింది?

పరిచారకుఁడు :

ఆఁ, వల్లకాడయింది ... మీ మంచికోసమే చెపుతున్నాను, వినండి, ఇలాంటిచేష్టలు వొద్దు అన్నాను. ఆ గాడిద కొడుకులు ...

వసుమతి :

[ప్రక్కన నవ్వి] నువ్వు గాడిదవా, అయితే? [నవ్వును]

పరిచారకుఁడు :

[విసుఫుకొనును.]

వసుమతి :

కోపం వొద్దు.

పరిచారకుఁడు :

కోపం వొస్తే మట్టుకు ఏం చెయ్యను? నాగొంతుక పిసుకోవాలి. విను: నే నెంత యేడ్చినా వాళ్లు విన్నారుకాదు. నువ్వు చెప్పిందే చెప్పేరు, మేం మాత్రం నీ మాట వినలేమనీ, ఇంకా ఏదో యేదో కూశారు. నా పెద్దకొడుకున్నాడే, వాడి కబుర్లు చూస్తే, ఓ, గోడలు దాటతాయి. వట్టి నిర్భాగ్యుల్లో ఒకటో రకం. చదువుకునే రోజుల్లో ఎవత్తెనో కులంలేనిదాన్ని ప్రేమించాడుట. నామాట వినకుండా ఇంట్లోనుంచి లేచిపోయి దాన్ని పెళ్ళి చేసుకున్నాడు. రెండో వా డొక దొరసానితో లేచిపోయి విదేశాలకు పోయి అక్కడ దాన్ని పెళ్ళి చేసుకున్నాడు. మూడో వాడు, అన్న లింతపనిచేస్తే తను వూరుకోడ మేమిటని, ఏదో సభల్లో కూసేడట. దానితో నాలుగు తన్నులు తన్ని దొరతనం వారు ఖైదులో వేసి యీమధ్యనే వొదిలేశారుట: ఊళ్ళమీదపడి తిరుగుతున్నాడు. ఇంక నాలుగో వాడు...

వసుమతి :

ఇది ఆఖరుదా, లేక ఇంకా ఏమన్నా వున్నాయా? [నవ్వును.]

పరిచారకుఁడు :

ఇది ఆఖరుదే; బ్రతికేను — నాలుగోవాడు కవి కింద మారేడు; అంటే పిచ్చివా డన్నమాట. నాకు కవిగాడంటే వొళ్లు మంట. అన్నీ అబద్ధాలే. అర్థం లేని వే వే వో పిచ్చిపాటలు చెయ్యడం; గొత్తిపోతులాగ జుట్టు పెంచుకో వడం; ఆడముండాకొడుకులాగ పవిటిలాగ ఏదో వేసుకోవడం; ఏ వేవో నాటకాలు రాయడం; ఒకడి పెళ్లాన్ని వొకడు మార్చుకోవడం కథ కింద వ్రాయడం—ఇవన్నీ కవిగాడి గుణాలు. మా వాడి కివన్నీ అబ్బేయి. దానితో వొళ్లుమండు కొచ్చి, భావ కవిత్వం చెబుతూ గుడ్లు తేలవేసి నప్పుడు దొడ్లోవున్న కట్టుకఱ్ఱ వూడదీసి, వాణ్ణి చావతన్ని అవతలి కీడ్చేశాను. మళ్ళీ వాడు రాలేదు; మిగిలిన వాళ్లూ రాలేదు.

వసుమతి :

అయ్యో, పాపం అత నెక్క డున్నాడో?

పరిచారకుఁడు :

వాడి మట్టుకు వాడు బ్రతుకుతున్నాట్ట, వాళ్ళకీ వాళ్ళకీ టోపీలు వేస్తూ. కాని, నాకు మాత్రం వాన కురిసి వెలిసినట్టుంది.

వసుమతి :

నాకూ ఇప్పు డలాగే వుంది! — నీ కిద్దరే కొడుకు లను కుంటూ వచ్చాను, నలుగు రని తెలియదు.

పరిచారకుఁడు :

ఇలాంటి వాళ్లు ఎంతమం దున్నా వొకటే.

వసుమతి :

వాళ్ళ నడిగితే నీ సంగ తేమని చెబుతారో.

పరిచారకుఁడు :

చేరు, నువ్వుకూడా వాళ్ళతో జేరు; అన్నట్టు, నువ్వు కూడా "ఎఫ్, ఏ యో ఏదో పేసయ్యావు కాదూ?— ను వ్వీనౌఖరీలో ఎందుకు జేరేవు?

వసుమతి :

తప్పేముంది! అయినా ఇంకొక శేముంది! అది కాకుండా వసంతసేనాదేవి నన్ను చాలా దయతో తనచెల్లెలిలా చూచి ఆదరిస్తుంది. ఆమె తండ్రి దయవల్లే కొంతవఱకూ నాకు విద్య వచ్చింది.

పరిచారకుఁడు :

అవును; వసంతసేనాదేవి మహాదయ కలది. నేను ఆమెని చిన్నప్పటి నించీ చూస్తున్నా; ఎంత అందమో అంత మంచి మనస్సు కూడాను. కాని,... [చెప్పఁబోయి యూరకుండును.]

వసుమతి :

ఏమిటి, కానీ అన్నావు!

పరిచారకుఁడు :

ఏమీ లేదు.

వసుమతి :

నాకు తెలుసును...మీ అందరికీ వున్న తెగులే ఇది. [లేచును.]

[ ఆలగ్లవస్త్రములు ధరించి విక్రమార్కుఁడు ప్రవేశించును. పరిచారకుఁడు పని చక్కఁబెట్టు చుండును. వసుమతి గదినుండి వెడలఁ బోవును. ]

విక్రమార్కుఁడు:

వసుమతీ ! అన్నీ సిద్ధంగా వున్నాయా ?

వసుమతి :

ఆ ; పువ్వులకోసం వెళుతున్నాను. ( వెడలును ).

విక్రమార్కుఁడు :

శారదా ! అశోకునీ, వసంతసేనా దేవినీ సమయమయింది దయచెయ్య మని చెప్పు.

పరిచారకుఁడు :

[ నిష్క్రమించును. ]

విక్రమార్కుఁడు :

[ అన్నియు సరిచూచి ] వసంతసేనకి, ఎక్క డేవస్తు వుండాలో అక్కడది లేకపోతే నచ్చదు. [ వస్తువుల సవరించుచు వసంతసేన ఛాయాపటమును గాంచి, సమీపించి దాని వంకఁ దేరిపారఁ జూచును. చేతితోఁ గన్నులు దుడుచుకొని నెమ్మదిగ వచ్చి సోఫాలోఁ గూలఁ బడును. ] నామనస్సులోనించి ఎంత పోగొట్టుకోవాలని ప్రయత్నించినా అది పోవడంలేదు ... (కన్నులు మూసికొని) నాబాధలకి అంతం లేదా ?

వసుమతి :

[ కుసుమ కండికలతోఁ బ్రవేశించి వాని నచ్చ టచ్చటనుంచును. ]

విక్రమార్కుఁడు :

[ కనులు తెఱచి ] వసుమతీ ! అయిదు గంటలు కావచ్చింది;

అతిథు లెవరైనా రాగానే నాకు తెలియజెయ్యి! నేను వారి నెదుర్కోవాలి.

వసుమతి :

ఆలాగే. [వెడలఁ బోవును.]

విక్రమార్కుఁడు :

[నిట్టూర్చి, శిరమును హస్తములతోఁ బట్టుకొని సోఫాపైనానుకొనును.]

వసుమతి :

[ఆతని గాంచి, యాఁగి] అదేం, అస్వస్థతగా వున్నారా?

విక్రమార్కుఁడు :

[చూచి] అవును... లేదు, లేదు.

వసుమతి :

దేవితో చెప్తాను.

విక్రమార్కుఁడు :

వొద్దు, వొద్దు; నేను బాగానే వున్నాను.

వసుమతి :

ఆసంగతి దేవికి తెలుసును. [మందహాసాంకురము.] [వసంతసేన ప్రవేశించును : నీలిరంగు వస్త్రములు ; అలంకార శోభిత ; ఆమె జగన్మోహిని — వసుమతి నిష్క్రమించును].

విక్రమార్కుఁడు:

[లేచి, యామెను జూచి తలవంచుకొనును.]

వసంతసేన :

[చిరునవ్వుతో] ఏమి, విక్రమార్కా! నన్ను చూచి తలవంచుకున్నావు ?

విక్రమార్కుఁడు :

వసంతసేనా! క్షమించు. నేను మాడలేను.

వసంతసేన :

ఏం. నే నంత అసహ్యాంగా వున్నానా ?

విక్రమార్కుఁడు :

[ఆమెనుగాంచి, కన్నులుమూసికొని] వసంతసేనా ! నాకు శక్తి లేదు ; నేను భరించలేను. నేను ఎక్కడికో పడి పోతున్నాను... [హృదయము చూపి] ఇక్కడేదో నుండి పోతున్నట్టుంది ; ఏదో వెలిగిపోతోంది......నీరూపం...క్షమించు, వసంతసేనా!... నేను దానిలో పడిపోను ... [విజృంభించి] నాకు శక్తివుంది. నన్ను మోహాం జయించలేదు... వసంతసేనా ! నేను ఏవేవో అన్నాను ; నాకు తెలియదు — క్షమించు.

వసంతసేన :

నిన్ను క్షమించడమా ? జయిస్తాను! నేను కాదు ప్రేమ జయిస్తుంది — [సమీపించును.]

విక్రమార్కుఁడు :

వొద్దు, వొద్దు. [వడఁకును.]

వసంతసేన :

ఈ సమయంకోసమే ఇన్నాళ్ళూ ఆగి వున్నాను ; ఇన్నాళ్ళకి నా ప్రార్థన ఫలించింది... [సమీపించి, అతని హస్తమును దృఢముగ గ్రహించి] విక్రమార్కా! [ఉద్రేకాతిశయముతో] ప్రాణప్రియా ! చూడు, నన్ను చూడు — ఈ నా దివ్యమోహాన

విగ్రహం, ఈ మోహానతరమైన నా హృదయం నీవే, నీ వాక్కుడివే — ఎప్పటికీ ...

విక్రమార్కుఁడు :

[సర్వమును మఱచి స్తబ్ధుఁ డగును.]

వసంతసేన :

[ఉద్రేకముతో] ప్రియతమా ! నీలో రక్తముందా ? నీలో హృదయం లేదూ ? నువ్వు జీవించగలుగుతున్నావా ? [అతనిని దగ్గఱకు లాగును.]

విక్రమార్కుఁడు :

[అత్యంతోద్రేకముతో నామెను దన బాహువులయందు బంధించి] వసంతసేనా ! ప్రేమమూర్తీ ! ... నువ్వే జయించావు : నీ దాసుణ్ణి — ఇప్పుడు, ఇకముందు, ఎప్పుడూ...

వసంతసేన :

[నిమీలితనేత్రయై యతని కౌఁగిటిలోఁ బరవశత్వముఁ జెందును.]

విక్రమార్కుఁడు :

నా హృదయాధి దేవతవు నువ్వు ; నేను నిజంగా ఇప్పుడు జీవించుచున్నాను. నీప్రేమ, కాదు...మనప్రేమ నన్ను జీవింప చేసింది ఇన్నాళ్ళకి. ఇన్నాళ్ళూ నేను మరణించి వున్నాను. నువ్వు నాలో నూతనజీవం పోశావు ; నీప్రేమే నాకు ప్రాణం. ప్రియా ! నిన్నింక విడిచిపెట్టను — ఎన్నటికీ విడవలేను ...

వసంతసేన :

విడవవద్దు ; విడిచిన నేను బ్రతకలేను.

విక్రమార్కుఁడు :

నే నింక మాట్లాడలేను. [ఆమె ముఖమును దేరి పారఁ జూచుచు] ఇంత జగన్మోహినిని పూజచేయకుండా ఇన్నాళ్ళు ఎలా వున్నానో !

వసంతసేన :

ప్రియతమా ! మాట్లాడకు ; నీ హృదయం నా హృదయంతో మాట్లాడుతుంది. నాప్రేమ నీప్రేమని ఆలింగనం చేసుకుంటుంది. మన ప్రాణాలు ఐక్యం పొందుతున్నాయి... ఆహా !...ఎన్నాళ్ళకి !...

విక్రమార్కుఁడు :

నా దేవీ !...

వసంతసేన :

నా ప్రభూ !...

[ఇరువురును జుంబనానందమునఁ జొక్కిపోవుదురు. వసుమతి ప్రవేశించి, వారినిఁ గాంచి, వెనుకకుఁ దగ్గి, తలుపు వైచి నెమ్మదిగ నిష్క్రమించును.]

విక్రమార్కుఁడు :

దేవీ !... ఏమి సౌఖ్యము ! — కాని ఇన్నిదినములు నీ ప్రేమను గ్రహించలేక, ఇన్నిదినములూ నాలో వున్న నా ప్రేమ వాహినిని తెలుసుకో లేక నిన్ను కృశింపజేసి, నేను కృశించాను ; క్షమించు వసంతసేనా ! నీప్రేమను తెలిసికో లేని ఇన్నిదినములూ నిరర్థకములు.

వసంతసేన :

నే నడిగిన దిస్తే క్షమిస్తాను.

విక్రమార్కుఁడు :

ఏదైనా సరే, నా ప్రాణమైనా సరే ఇస్తాను. అడుగు.

వసంతసేన :

[నవ్వుచు] ఇదీ — [తన పెదవుల నందించును.]

విక్రమార్కుఁడు :

[ప్రేమాతిశయముతో నామె పెదవులపైఁ జుంబనమొనర్చును.]

[ఒకనిమిషము నిశ్శబ్దము.]

వసంతసేన :

ప్రియా!

విక్రమార్కుఁడు :

ఏం, ప్రియతమా!

వసంతసేన :

ఏమీ లేదు — అలా పిలవడంలో ఆనందం వుంది.

విక్రమార్కుఁడు :

నా ఆనందం నేను చెప్పలేను. నరకాన్ని స్వర్గం చేశావు.

[ఆమెను గాఢముగఁ దనహృదయమునకు హత్తుకొనును.]

వసంతసేన :

నే నింక నుంచో లేను.

విక్రమార్కుఁడు :

[ఆమెను బదిలముగ నెత్తి, సోఫాపైఁ గూర్చుండఁ జేసి, తానుప్రక్కగఁ గూర్చుండును.]

వసంతసేన :

[నవ్వుచు] ఇంతప్రేమను ఇన్నాళ్ళు ఎలాదాచావు!

విక్రమార్కుఁడు :

ప్రియా ! ఇన్నాళ్ళూ నాలో చైతన్యం లేదు.

వసంతసేన :

నేను ఆనాడు నిన్నడిగినప్పుడు నన్ను ప్రేమించడంలేదని చెప్పేవు కదూ మరీ ?

విక్రమార్కుఁడు :

అవును ; అన్నాను. నాకు ప్రేమ అంటే అర్థం తెలియలేదప్పుడు. అప్పుడు నాకు ప్రపంచంమీదవున్న కోపం నన్ను అంధుణ్ణి చేసివేసింది. అసలు ఈ ప్రపంచంలో ప్రేమ లేదనుకున్నాను — నిజం చెబుతున్నాను — [ఆమెహస్తమును ముద్దుపెట్టుకొని] నేటివరకు ప్రేమ యిట్టిదని నాకు తెలియదు.

వసంతసేన :

కాని — నువ్వు సుందరుడవు. అనేకమంది నిన్ను వలచేరు కదూ ?

విక్రమార్కుఁడు :

వారి ప్రేమ యిట్టిది కాదు ; అది కేవలం మోహం. అదేమైనా, నే నిదివరకెన్నడూ ఇలాంటి పవిత్రప్రేమని అనుభవించి యుండలేదు.

వసంతసేన :

[సంతోషముతో] నిజంగా ?

విక్రమార్కుఁడు :

సత్యం — అనేకమందితో స్నేహంగా వున్నాను. కాని అది

ప్రేమకాదు...నిన్ను ఒక్కదాన్నే నేను గాఢంగా ప్రేమిస్తున్నాను. ఇట్టిప్రేమలు రెండుండవు. ఒక్కటే ఎప్పటికీ; త్రికాలములకీ ఇదే!

వసంతసేన :

పూర్వాన్ని కూడా ఎలాచేస్తావు? [అతని హస్తమునునొక్కును]

విక్రమార్కుడు :

ఇటువంటి ప్రేమ పూర్వం కూడా వుండి వుండాలి. నిన్ను చూసి నప్పుడే నాహృదయం ఒక విధమైన వికారాన్ని పొందింది. కాని అప్పుడది ఇటువంటి ప్రేమకి మూలం అని నేను గ్రహించలేదు; కాని నా ఉత్తమమిత్రులలో నిన్నొకదాన్నిగ గణిస్తూండే వాణ్ణి.

వసంతసేన :

అబ్బ, అందరిలో ఒకటా? ఆ మాట నేను వినలేను.

విక్రమార్కుడు :

వసంతసేనా! [ఆమె హస్తమును గ్రహించి] కాదు — అందరికంటె నీవే అధికురాలవు; నా కిక అందరు అనేదే లేదు — నీవే, నీవొక్కతెవే...కాని అది మునుపు తెలిసికోలేకపోయాను. నేను గ్రహించలేకపోయినా, ఎంత లోతులలో అణిగివున్నా, ఈ దివ్యప్రేమ పూర్వం కూడా వుంది; ఈప్రేమ కాలాతీతమైనది.

వసంతసేన :

భగవంతుడు దీనిని శాశ్వతముగ నుంచుగాక!

విక్రమార్కుఁడు :

దైవసాక్షిగా ప్రమాణం చేస్తున్నాను: ఈ జీవిత మున్నంత వరకూ, మరణంలోనూ, తరువాత శాశ్వత జీవనంలోనూ, ఎప్పుడూ నిన్ను, ని న్నొక్కదానినే అపరిమితంగా ప్రేమిస్తాను. ప్రియతమా! నీవో?

వసంతసేన :

నేను కూడా అదే ప్రమాణం చేస్తున్నాను. [ఒకరి నొకరు గాఢముగ ముద్దు పెట్టుకొందురు.] విక్రమార్కా! ఈశ్వరుడు దయామయుడు!

విక్రమార్కుఁడు :

[నవ్వుచు] అవును. మన యీ పవిత్రప్రేమ ఈశ్వరుని అనంత ప్రేమని చాటుతుంది. [ఇరువురును కరస్పర్శఁ జేయుదురు — వసుమతి దగ్గుచుఁ దలుపుఁ దీయును : వసంతసేనా విక్రమార్కులు లేతురు.]

వసుమతి :

అతిథులు వస్తున్నారు.

విక్రమార్కుఁడు :

ఇప్పుడే వస్తా. [నిష్క్రమించును.]

వసుమతి :

దేవీ! గాలికి మీతల చెదిరింది.

వసంతసేన :

[అద్దములోఁ జూచుకొని] ఔను; వస్త్రములు కూడా నలిగిపోయాయి, అజాగ్రత్తగా కూర్చోడంవల్ల—[మందహాసముఁ జేయును.]

వసుమతి :

నవ్వు నాపుకొనుచు.] అతిథులు వస్తున్నారు.

వసంతసేన :

ఇప్పుడే వస్తా. [నిష్క్రమించును.]

వసుమతి :

[ఆమె వైపు చూచుచు] సౌందర్యమూర్తి ; ప్రేమమూర్తి ; ఆనందమూర్తి ;......తత్వేం ?

[ఆంగ్లవస్త్రములు ధరించి అశోకుఁడు ప్రవేశించును.]

అశోకుఁడు :

వసుమతీ ! దేవి ఏది ?

వసుమతి :

వస్తున్నారు. [విక్రమార్కుఁడు, జ్యోతిర్మయి, ఆమెభర్త — నిర్మలుఁడు ప్రవేశింతురు.]

అశోకుఁడు :

[నమస్కరించి.] దయచెయ్యండి.

జ్యోతిర్మయి :

అశోకా ! చాల నాళ్ళయింది నిన్ను చూసి.

నిర్మలుఁడు :

కులాసాగా వున్నావా ?

అశోకుఁడు :

మీ దయవల్ల. [వసుమతీ విక్రమార్కులు నిష్క్రమింతురు.]

అశోకుఁడు :

ఇలా కూర్చోండి.

[జ్యోతిర్మయి సోఫాపైఁ గూర్చుండును; నిర్మలుఁ డొక కుర్చీపైనను, అశోకుఁడు జ్యోతిర్మయిప్రక్కను ఆసీను లగుదురు].

జ్యోతిర్మయి :

వసంతసేన కింకా అలంకారం కాలే దనుకుంటా ! —

అశోకుఁడు :

ఇప్పుడే వొస్తుంది.

జ్యోతిర్మయి :

వసంతసేనకి ఎన్నిబట్టలున్నాయో లెక్కలేదు. ఈమధ్య తరుచు చూస్తున్నాంకాదూ; కట్టినచీర మళ్లీ కట్టలేదు.

నిర్మలుఁడు :

[ భార్యను గూర్చి వారించు చూపుఁ జూచును ].

అశోకుఁడు :

ఎక్కడకి వెళ్లేది ?

జ్యోతిర్మయి :

ఏం, ఎక్కడికీ బయటకి వెళ్ళకూడదా ? నువ్వు యూరపులో వుంటే ఆమె ఏం చేస్తుంది ! విక్రమార్కుడు, పాపం ఆమెకి సహాయంగా వుండేవాడు. లేకపోతే...... [అర్థగర్భిత మగునవ్వు]

అశోకుఁడు :

అబ్బే ! త ప్పేముంది ?

వసంతసేన :

[ప్రవేశించి, నమస్కరించి] జ్యోతీ! ఆలస్యమయింది! క్షమించాలి. [పురుషులు లేచుచు — నిర్మలుని గాంచి] క్షేమమా! దయ చెయ్యండి.

[విక్రమార్కుఁడు, యశోధర, ఆమె తమ్ముఁడు—రామమోహనుఁడు, వసుంధర, ఆమెతల్లి—అనసూయ ప్రవేశింతురు.]

వసంతసేన :

[నమస్కరించి] మీరు అందరూ రావడం చాలా సంతోషం — దయచెయ్యండి.

అశోకుఁడు :

ఎన్నాళ్ళకి, మీ అందరి దర్శనం!

[అందఱును నౌకరి దగ్గఱ అశోకుని కదలుచు మాట్లాడుచుందురు. వసంతసేన, విక్రమార్కుఁడు మాత్రము నిలువఁబడియుందురు.]

వసంతసేన :

విక్రమార్కా! పదార్థాలు తెమ్మని చెబుతావా? [చిఱునవ్వు]

విక్రమార్కుఁడు :

మీ ఆజ్ఞ! [చిఱునవ్వుతో నిష్క్రమించును].

[అందఱును ఈ చిఱునవ్వును గాంచి, యొకరిపై నొకరు సాభిప్రాయముగఁ జూచుకొందురు. అశోకుఁ డది గాంచి యర్థముచేసికొనలేక పోవును].

వసంతసేన :

[అశోకునితో] ఆనందుడూ, వకుళా ఇంకా రాలేదు.

అశోకుఁడు :

ఆరుగో —

[ఆనందుఁడు నతని భార్య వకుళయుఁ బ్రవేశింతురు; వారివెనుకనే విక్రమార్కుఁడు ప్రవేశించును. పురుషులు లేతురు].

వకుళ :

ఆలస్య మయింది ; క్షమించాలి.

ఆనందుఁడు :

వకుళదే ఆలస్యం....

వసంతసేన :

[నవ్వుచు] అన్నింటికీ ఆడవాళ్ళదే తప్పు. పాపం — దయ చెయ్యండి.

అశోకుఁడు :

ఆనందా ! మనం మాట్లాడలేం !

వకుళ :

విక్రమార్కా ! నిన్ను చూసి చాలా రోజులయింది.

విక్రమార్కుఁడు :

[నవ్వును]

[అందఱు మాట్లాడుచుఁ గూర్చుందురు — వసుమతియు సేవకుఁడును ఖాద్యములఁ దెచ్చి బల్లమీఁద నుంచి నిష్క్రమింతురు. వసంతసేన పాత్రములలోఁ దేనీరు పోయును ; విక్రమార్కుఁడు వానినందఱకు నిచ్చును. మిగిలిన పదార్థము లతిథులకు దగ్గరగ నక్కడక్కడ నుంచుచుండును. విక్రమార్కుఁడు వకుళకు సమీపమునఁ గూరుచుండును — అందఱును మాట్లాడుచు భుజించుచుందురు].

వకుళ :

విక్రమార్కా ! నిన్ను చూడడం నాకు చాలాసంతోషం.

విక్రమార్కుడు :

నిజంగా !

వకుళ :

ఏం, అలా అంటున్నావు ?

విక్రమార్కుడు :

ఏమీ లేదు.

వకుళ :

ను స్త్రీసంఘాన్ని విడిచిపెట్టి వెళ్ళినప్పటినుంచీ ఇక్కడ స్త్రీల కసలేమీ తోచడం లేదుట ! [నవ్వును].

విక్రమార్కుడు :

[ఆత్మోక్తి] మళ్ళీ ప్రారంభం — [వకుళతో] అవును పాపం, నా కోసం కృశించిపోయారు.

వకుళ :

[ఒక్కింత వెలవెలం బోయి] నేను మాత్రం నువ్వు కనిపించక పోతే చాల విచారించాను సుమా; మనస్నేహం-

విక్రమార్కుడు :

[వికటముగ] ఇన్నాళ్లూ ఏమయింది ? మీ స్నేహాలు నాకు అర్థం కావు. నాతో ఆడేరు నే నున్నన్నాళ్లూను; నేనులేనప్పుడు కూడా ఆడేవాళ్ళ పేర్లు చెప్పనా ?

వకుళ :

[ముఖముద్రిప్పుకొనును.]

వసంతసేన :

రామమోహనా! పరీక్షలో బాగా వ్రాశావా ?

రామమోహనుఁడు :

బాగానే వ్రాశాను.

యశోధర :

విక్రమార్కా !

విక్రమార్కుఁడు :

[యశోధరను సమీపించును.]

యశోధర :

మాయింటికి బొత్తిగా రావడం మానేశావేం ?

విక్రమార్కుఁడు :

రా తగినవాణ్ణి కాను కాబట్టి ?

యశోధర :

ఏం ?

విక్రమార్కుఁడు :

మీకే తెలుసును ; మీరు ఎవరితో ఏమన్నారో జ్ఞాపకం లేదూ ? వకుళ......

యశోధర :

వకుళమాటలు నమ్మకు ; ఆమెకి అసూయ.

విక్రమార్కుఁడు :

నే నెవరిమాటలూ నమ్మను.

వకుళ :

రామమోహనా , రాత్రి సినీమాకి వస్తావా ?

రామమోహనుఁడు :

[చెల్లెలివైపుఁ జూచి] ఏం?

యశోధర :

నేనూ, జ్యోతిర్మయీ, నిర్మలుడూ వెడుతున్నాం—

వకుళ :

[వికటమందహాసముఁ జేయును]

జ్యోతిర్మయి :

[కనుబొమ్మలు ముడుచును]

నిర్మలుఁడు :

[ 'హై' సర్దుకొనును]

విక్రమార్కుఁడు :

[చిఱు నవ్వు].

వసుమతి :

అశోకా! వీనిని వసుంధరకు చూపించు.

అశోకుఁడు :

[అట్లు చేయును.]

రామమోహనుఁడు :

క్షమించాలి, నేను వసుంధర ఇంటికి భోజనానికి వెళ్ళాలి.

వసంతసేన :

[వకుళను చేరి మాటలాడును.]

విక్రమార్కుఁడు :

[అనసూయను చేరి మాటలాడును].

అనసూయ :

విక్రమార్కా! ఎన్నాళ్లకి దర్శనం!

విక్రమార్కుఁడు :

ఆ మాట నే ననాలి.

అనసూయ :

వసుంధర నువ్వు వెళ్ళినప్పు డెంతో ఏడ్చింది సుమా, పాపం స్నేహంచేత.

విక్రమార్కుఁడు :

తరవాత పూరుకుందిగా. ఇప్పు డింక మరిచిపోయింది కూడాను, బహుశః.

అశోకుఁడు :

[లేచి వేఱొకరితో మాట్లాడును.]

రామమోహనుఁడు :

[వసుంధర దగ్గఱకుఁ బోయి కూర్చుండును.]

వసుంధర :

[అర్థోక్తి] రామమోహన్, నువ్వు నాదగ్గరే వుండు. [అతని వైపు ప్రేమతోఁ జూచును.]

రామమోహనుఁడు :

[విక్రమార్కుని సూచించుచు] మీ స్నేహం ఏ మయింది ?

వసుంధర :

[నవ్వుచు] అది పూర్వపు సంగతి.

అనసూయ :

[విక్రమార్కునితో] మరచిపోవడం ఏమిటీ — ఎవరు తరుచు కలుస్తూంటే వాళ్ళతో స్నేహంగా వుంటా రీకాలం వాళ్లు.

విక్రమార్కుఁడు :

కుక్కల కుండే విశ్వాసం ఆశ్చర్యకర మైనది ; నేను ఇల్లు విడిచి వెళ్లిపోయినతరవాత నా కుక్క నాకోసం కృశించి, కృశించి చచ్చిపోయింది.

రామమోహనుఁడు :

విక్రమార్కా !

విక్రమార్కుఁడు :

[ రామమోహనుని సమీపించును. ]

రామమోహనుఁడు :

ఏం, నాదగ్గరకి వచ్చావు కాదేం !

విక్రమార్కుఁడు :

చిన్నపిల్లలకి అడ్డురావడ మెందు కని. [నవ్వును]

వసుంధర :

విక్రమార్కా ! క్షేమమా ?

విక్రమార్కుఁడు :

మీ దయవల్ల.

వసుంధర :

[ ఒకించుక ఖిన్నురా లగును. ]

అశోకుఁడు :

విక్రమార్కా !

విక్రమార్కుఁడు :

[సమీపించును. ]

అశోకుఁడు :

గ్రాంఫోను ప్రారంభిస్తావా !

విక్రమార్కుఁడు :

[ అట్లు చేయును. ]

[ అందఱు నృత్యము సేయుచుందురు — విక్రమార్కుఁడును వసంతసేనయుఁ గలిసి నృత్యము చేయుదురు.

అశోకుఁడు సతినితో నృత్యము చేయుచున్న వ్యక్తియుఁ దక్కఁ దదితరులు వసంతసేనా విక్రమార్కులవైపు చూచుచుందురు. ఇట్లా ద్వంద్వములు నృత్యము సేయుచు రంగస్థలమునఁ ప్రేక్షకుల సమీపమునఁజేరి వారిలో వారిట్లు మాటాడుకొందురు – "చూశావా, వసంతసేన ఏం చేస్తోందో ?"; "ఎంత సిగ్గు చేటు !"; "భర్తవున్నాడనికూడా జంకులేదే !" — అశోకుఁ డొక్కింత ఖిన్నుఁడగును. సంగీతి మాఁగును. అందఱు నృత్యము మాని, మాటలాడుచుఁ గూర్చుందురు. ]

వకుళ :

వసంతసేన కెంతచెమట పట్టిందో !

వసంతసేన :

[ముఖముఁ దుడుచుకొనును.]

జ్యోతిర్మయి :

విక్రమార్కా ! అప్పుడే అలసట వచ్చిందా ?

విక్రమార్కుఁడు :

[ తెచ్చి పెట్టుకొనిన నవ్వు నవ్వును.]

యశోధర :

[భర్తతో] చూశారా, తమాషా !

ఆనందుఁడు :

ఇక్కడేమీ గొడవపెట్టకండి.

[అందఱును విక్రమార్కుని, వసంతసేనను జూచి, పిమ్మట నశోకుని వంకఁ గాంతురు].

అశోకుఁడు :

[ముఖము వంచి క్రిందకిఁ గాంచి] ఇప్పుడు మీ ఆడవాళ్లందరూ యూరపులో స్త్రీలలాగ కాళ్ళగోళ్ళకి కూడా రంగులు వేస్తున్నారే!

జ్యోతిర్మయి :

రంగులు వేస్తేనే గాని మాట దక్కుతుందా?

[వసంతసేనవైపుఁ జూచుచు నందఱు నవ్వుదురు.]

అశోకుఁడు :

[మిక్కిలి బాధ నొంది] ఇక్కడ చాలా వేడిగావుంది.

వకుళ :

ఉండదూ మరీ? — వేసంగి సమీపిస్తోంది కాదూ?

[అందఱు నొకరిముఖమొకరు చూచుకొందురు].

వసంతసేన :

నాకు తల తిరుగుతోంది — కిటికీ తియ్యరూ? [గోడను బట్టుకొని పడకుండ నిలువ ప్రయత్నించును].

అశోకుఁడు :

[గవాక్షమును తెఱచును.]

విక్రమార్కుఁడు :

[వసంతసేనను బట్టుకొని సోఫాపైఁ గూర్చుండఁబెట్టును.]

జ్యోతిర్మయి :

[వకుళతో] మంచినీళ్ళు !

వకుళ :

ఓ !

అశోకుఁడు :

[ఆమాటలు విని బాధపడును.]
[అందఱును లేచెదరు.]

వసంతసేన :

క్షమించాలి ! తల తిరిగింది; ఇప్పుడు కొంచెం నయమే. దయచేసి అందరూ కూర్చోండి — విక్రమార్కా ! ఫలరసం తెప్పించు.

[అంతట నొకరి పిదప నొకరు "ఇంక సెలవు—చాలాధన్యవాదాలు—ఆలస్య మయింది" అనుచుఁ బోఁ బోయెదరు.]

వసంతసేన :

అప్పుడే !

ఆనందుఁడు :

క్షమించండి; సెలవు.

[వసంతసేన యెట్లో నిలుచుండి నమస్కరించును. అతిథులందఱును ప్రథమమున వసంతసేనకును పిదప నశోకునకును నమస్కరించి యామె వైపు జాలిగాఁ గని సెలవనుచు నిష్క్రమింతురు.]

అశోకుఁడు :

వసంతసేనా ! నీతో మాట్లాడాలి.

[విక్రమార్కుఁడు నిష్క్రమించును.]

అశోకుఁడు :

[వసంతసేనను సమీపించి] కూర్చో —

వసంత సేన

[సోఫాలోఁ గూర్చుండును.]

అశోకుఁడు :

ఏమి టిదంతా ?

వసంత సేన :

ఏమిటి ?

అశోకుఁడు :

[ఉద్రేకముతో] నాకు తెలియ దనుకొంటున్నావా ?

వసంత సేన :

[మౌనము]

అశోకుఁడు :

విక్రమార్కుణ్ణి మన ఇంట్లోంచి పంపించెయ్యాలి.

వసంత సేన :

[మౌనము]

అశోకుఁడు :

నాయింటికి కళంకం తెచ్చాడు.

వసంత సేన :

ఏం చేశాడు ?

అశోకుఁడు :

నీకంత కష్టం ఎందుకు ?

వసంత సేన :

[మౌనము]

అశోకుఁడు :

ఏం, మాట్లాడవేం ?

వసంతసేన :

[మౌనము — ఆలోచన.]

అశోకుఁడు :

వెంటనే పంపించెయ్యి.

వసంతసేన :

నేను చెప్పను.

అశోకుఁడు :

ఓహో, పాకం ముదిరిందే — ఇది నాయిష్టం ; విక్రమార్కు డిక్కడుండ కూడ దింక.

వసంతసేన :

నేనూ వుండను.

అశోకుఁడు :

[చకితుఁడై] ఏమిటీ !

వసంతసేన :

నేనూ వుండను —

అశోకుఁడు :

అతనితో పోతావా ?

వసంతసేన :

అది నా యిష్టం.

అశోకుఁడు :

నీకు సిగ్గులేదు.

వసంతసేన :

లేదు — సిగ్గెందుకు ?

అశోకుఁడు :

నువ్వు మశ్చాత్రవు —

వసంతసేన :

నేను కాదు.

అశోకుఁడు :

కావూ ? నీకూ విక్రమార్కుఁడికీ వున్న సంబంధం ఏమిటీ ?

వసంతసేన :

నే నతన్ని మనస్ఫూర్తిగా, దైవసాక్షిగా ప్రేమిస్తున్నాను.

అశోకుఁడు :

ఎంతపాతకివి !

వసంతసేన :

నేను పాతకిని కాను.

అశోకుఁడు :

కావా ? — పరపురుషుణ్ణి ప్రేమించవచ్చా ? అది మంచిదా ?

వసంతసేన :

నాకు అతడే సర్వస్వము — అతడే భర్త, అతడే మిత్రుడు, అతడే ప్రాణప్రియుడు, అతడే దైవము —

అశోకుఁడు :

[మండిపడిచూచును.]

వసంతసేన :

మీరు మీ ఇష్టం వచ్చినట్లనుకోండి; ప్రపంచ మేమైనా అనుకో నియ్యండి. నాకు అవసరం లేదు. నాప్రేమ దివ్యమైనది; శాశ్వతమైనది; నాప్రేమయే నాకు ధర్మము. విక్రమార్కుడే నాకు ప్రాణము; భగవంతుడే నాకు దిక్కు. మిగిలిన దంతా నా కగోచరము.

అశోకుఁడు :

నువ్వు నాయింట్లో వుండొద్దు, వెళ్ళిపో — నువ్వు పతితవు —

వసంతసేన :

ఇప్పుడే వెళ్ళిపోతాను. కాని నేను పతితనుమాత్రం కాను; ఉత్థితను — పతన మేదీ? నా దివ్యప్రేమ తత్వం అర్థం ఎవరికి తెలుస్తుంది? దుర్గ్రాహ్యము, ... ఏం, వివాహ మైనంత మాత్రాన హృదయం చచ్చిపోవలసిందేనా? ప్రేమ అనేది ఎండిపోతుందా? ...

అశోకుఁడు :

స్వైరచారిణి!

వసంతసేన :

నేను కాను — నాకు విక్రమార్కు డొక్కడే —

అశోకుఁడు :

పో!

వసంతసేన .

సెలవు — నా భార్యాధర్మము నతిక్రమించినందుకు క్షమాపణ — కాని నా ప్రేమ ధర్మం అన్నిధర్మాల కంటే గొప్పది. [నమస్కరించి నిష్క్రమించుచు నే పథ్యమున.] నా కుమారుని మట్టుకు జాగ్రత్తగా చూడండి, అంతే నా ప్రార్థన.

అశోకుఁడు :

[తలుపు గట్టిగాఁ గొట్టి మూసి వచ్చి, సోఫాలోఁ గూలఁబడును.]

తెర

# ఆ లోకమునుండి ఆహ్వానము

## తృ తీ యాం క ము.



[ప్రదేశము: ఒక హోటేలులోని యొక గది. నాలుగైదుకుర్చీలు, ఒక సోఫా, ఒకటి రెండుబల్లలు మొదలైనవి యుండును.

ప్రవేశము : విక్రమార్కుఁ డొకకుర్చీలోఁ గూర్చుండి యాలోచించుచుండును – తలుపుఁ దీసికొని వసంతసేన లోనికి వచ్చును.]

వసంతసేన :

ప్రాణప్రియా !

విక్రమార్కుఁడు :

[చటాలున లేచి యామె వైపు దిరుగును.]

వసంతసేన :

[చిఱునవ్వుతో] ప్రాణప్రియా !

విక్రమార్కుఁడు :

ఏం, ప్రేమదేవతా !

వసంతసేన :

[అర్ధనిమీలితనేత్రయై] ప్రాణప్రియా !....నాదగ్గరకి రావూ ?

విక్రమార్కుఁడు :

[వేగముగ సమీపించి, యామెను దనబాహువులతో దృఢముగ బంధించి నిమీలితనేత్రుఁడై] ఏం ?

వసంతసేన :

[తన బాహు వల్లరుల నాతని కంఠమునకుం బెనవైచి, యతని కన్నుల లోనికిం బ్రేమతోం జూచుచు] నువ్వు నాకు దూరమైపోతే ఒక్క నిమిషమైనా జీవించలేను —

విక్రమార్కుండు :

నీకు దూరంగా వున్న క్షణం నాకు సహించడానికి వీలు లేని ఒక యుగం — వసంతసేనా, ఇలా కూర్చోవూ ? నీకు నీరసం తగ్గిందా ?

వసంతసేన :

[ఆతని హస్తముపై వాలుకొని నడచుచు] ఇప్పుడు నా కేబలహీన మూలేదు. రాత్రి నిద్రకూడా బాగా పట్టింది — కాని, ప్రాణప్రియా ! నే నెట్టి ఆనందం పొందుతున్నానో చెప్పలేను ; నువ్వు గ్రహించలేవు — నేనే గ్రహించలేకుండా వున్నాను. నా ఆనందం నా ప్రేమా ఒకటే ; భావాతీతం అది ; అపారమూ, కాలాతీతమూను. ఈ మహాప్రేమానందప్రవాహంలో వూపిరి సలపకుండా తేలిపోతున్నాను. మిగిలింది, అగోచరమూ, అనవసరమూను. నువ్వూ నేను — నేనూ నువ్వూ — మన అన్యోన్య ప్రేమశక్తి — అంతే — ఎప్పటికీ కావలసింది అంతే. తక్కిన దంతా నాకు త్యాజ్యము, క్షుద్రము — ఓ ప్రాణవల్లభా ! ఇటువంటి మహానుభవం నా జీవితంలో ఇదివర కెన్నడూ పొందలేదు...

విక్రమార్కుడు :

ప్రేమరాజ్ఞీ! నా జన్మ సార్థకమయింది. ఈ భావమే నన్ను మత్తునిగ చేసివేసింది. [ఆమెను గట్టిగ బంధించి] మోహనమూర్తీ — దివ్యమూర్తీ — ఎప్పటికీ నీకు సేవకుణ్ణి ...

[ ఇరువురుఁ గౌఁగిలించుకొని కూర్చుందురు — విక్రమార్కుఁడామెను పెదవులపై ముద్దుపెట్టుకొనును. ]

వసంతసేన :

[నిమీలితనేత్రయై తనశిరము నాతని వక్షముపై నానుకొనును.]

విక్రమార్కుడు :

[ ఆమెముఖమును వీక్షించి, వీక్షించి, కపోలముల నిమురుచుఁ దనకంటి నుండి యొకనీటిబిందువును తుడిచివైచును; ఆమె నుద్వేగముతోఁ గౌఁగిలించుకొని చెక్కులపై ముద్దాడును; బాష్పజల మామెచెక్కుల కంటుకొనును. ]

వసంతసేన :

[తొట్రుపాటుతోఁ గనులఁ దెఱచి, కూర్చుండి] ఏం ప్రాణప్రియా!—

విక్రమార్కుడు :

[ఆమె నేత్రములు ముద్దాడి] ఏమీ లేదు —

వసంతసేన :

చూడు, ప్రియా! — నా దగ్గర నీకు రహస్యమా?

విక్రమార్కుడు :

నీ దగ్గర నాకేమీ రహస్యముండదు. మన శరీరాలు రెండైనా ఆత్మమాత్రం వొకటే.

వసంతసేన :

అయితే చెప్పు, ఎందు కీకన్నీరు ? — మన బ్రహ్మానందంలో విచారానికి తా వేదీ ?

విక్రమార్కుఁడు :

ప్రాణప్రియా, ఆనందోద్రేకముతో బాష్పాలు నీకు పాద్య మిస్తున్నాయి.

వసంతసేన :

[నేత్రస్పర్శచేఁ దన బాష్పముల నతని బాష్పములతోఁ గలిపి వైచును.]

విక్రమార్కుఁడు :

వసంతసేనా, ఇంత ఆనందంలోనూ మనస్సులో కొంచెం బరువుకూడా ఉందిసుమా.

వసంతసేన :

ఏం ?

విక్రమార్కుఁడు :

ప్రియా, సర్వమూ త్యాగముచేసి, చివరకి నీబిడ్డనిగూడా విడిచి వచ్చేశావు, నాకోసం. ఈ దివ్యప్రేమకి అర్హుణ్ణిగా ప్రవర్తించే టట్టు నన్ను భగవంతు డనుగ్రహించుగాక ! — కాని నిన్నీవిధంగా ఈ స్థితిలోకి తీసుకురావడానికి కారకుణ్ణయానని మాత్రం నాకెంతో విచారంగావుంది. నేను ఎటువంటివాణ్ణి? — మహాపాపినేమో ! ఈ సంకోచమూ, ఈ భయమే నా హృదయంలో వున్న బరువు —

వసంతసేన :

[అతని వంక జాలిగఁ జూచుచు] ప్రాణప్రియా ! ఎందుకు నీ కీ వెఱ్ఱి ? నా ప్రాణమైనా సరే నీకోసం, మనప్రేమ కోసం అర్పిస్తాను ; నా కంతకంటె కావలసిన దేముంది? — నీ కే విధమైన సందేహామూ వొద్దు. నీ కోసం కాదు, నా కోసమే చేశా నీపనిని — ఇదే నాకు అవ్యయానందం — నువ్వా పాపి వెట్లా అవుతావు ? నాకు స్వర్గసౌఖ్య మిచ్చే పుణ్యాత్ముడవు ; నువ్వే నాకు ప్రపంచము, ప్రాణము ; సర్వస్వమూ నువ్వే. —

విక్రమార్కుఁడు :

నా ప్రేమమూర్తివైన నీకు నా ప్రాణాలనైనా యిచ్చి సంతోషపెట్టినప్పుడే నేను ధన్యుణ్ణి.

వసంతసేన :

విక్రమార్కా ! మనవాగ్దానము మరచిపోవు కదా, మరణానంతరం నన్ను కలుసుకునే వాగ్దానము ?

విక్రమార్కుఁడు :

ఎన్నటికీ మరిచిపోను. నువ్వు లేనిదే నాకు మరణానంతర జీవితం దుర్భరము.

[తలుపు తట్టఁబడును — విక్రమార్కుఁడు లేచి తలుపుఁ దీయును. వసుమతి ప్రవేశించి, వసంతసేన నుద్వేగముతో సమీపించి, మోకరించి, యామె హస్తముల గ్రహించి తన కన్నీటితోఁ దడుపుచు నేడ్చును.]

వసంతసేన :

[ఆమె శిరమును నిమురుచు] వసుమతీ, ఏడవ కమ్మా — ఎందుకూ ?

విక్రమార్కుడు :

[మెల్లగ నిష్క్రమించును.]

వసుమతి :

దేవీ ! నేను మాట్లాడలేను — అయ్యో, ఎంతపని జరిగింది! [మూర్ఛిల్లును.]

వసంతసేన :

వసుమతీ ! విచారించకు; విచారానికి కారణం లేదు. నే నెంత ఆనందంగా వున్నానో చూడు. ఇటువంటి సౌఖ్యం నేను నా జన్మలో ఎన్నడూ అనుభవించలేదు. లే, అమ్మా ! నాప్రక్కని కూర్చో —

వసుమతి :

[మెల్లగ లేచి యామె కు సమీపమున నున్న యొక చిన్న యాసనముపై గూర్చుండును.] దేవీ ! నిన్ను విడిచి నే నుండ లేను — నీ కొడుకు నీకోస మెంతో ఏడ్చాడు. నా గుండె బ్రద్దలై పోతుంది ; నే నింక చూడలేను.

వసంతసేన :

[అప్రయత్నముగ జాఱు కన్నీటి నాఁపుకొనుచు] వసుమతీ ! చిన్న వాడు — వాణ్ణి నువ్వు జాగ్రత్తగా చూడాలి.

వసుమతి :

దేవీ ! నీ బిడ్డకోస మైనా ఇంటికి తిరిగి రా : అంతా చక్క బడవచ్చు.

వసంతసేన :

నా కొడుకుని ఎడబాసి వుండడం నాకు మట్టుకు

ఇష్టమా ! — కాని నా ప్రేమదేవతఅయిన విక్రమార్కుని సాన్నిధ్యమే నాకు స్వర్గము ; ధర్మము—తక్కినది అగోచరము, అసంభవము. —

వసుమతి :

అమ్మా ! నీ భర్త నిన్ను తిరిగి స్వీకరించడానికి సిద్ధంగా వున్నాడు.

వసంతసేన :

[మలిన మందహాసముతో] ఏ మయింది ?

వసుమతి :

దేవీ ! చెబుతాను : క్షమించు — నువ్వు ఇల్లు విడిచి వెళ్ళి పోయిన రాత్రి నా కేమి చెయ్యాలో తోచిందికాదు ; పిచ్చి దాన్నయిపోయాను. ఏడుస్తోన్న నీ కొడుకుని నిద్ర పోగొట్టి ఆలోచించాను. నీ భర్త కోపం తగ్గించి అతన్ని కొంత వరకు వశ్యం చేసుకుని మళ్ళీ నిన్నతనిచేత యింటికి పిలిపించి మిమ్మల్నిద్దర్నీ ఏకంచేసి నేను నీ యిష్టా న్ననుసరించి నీ దగ్గరే వుండడమో, లేక ఎక్కడికైనా వెళ్ళిపోవడమో నిశ్చయించుకోవా లనుకున్నాను — నా యౌవనం, రూపం అనే అస్త్రాలు ప్రయోగించా నతనిమీద ; దేవీ! సత్యం చెబు తున్నాను — అతన్ని నేను కొంచెమైనా ప్రేమించలేదు ; విషయ వాంఛకూడా తలచలేదు — మిమ్మిద్దర్నీ మళ్ళీ కలపా లనే కోరిక వాకటేనాకు — నా సౌఖ్యం ఆలోచించలేదు. — నా శరీరాన్నతని కర్పించాను. అతను లొంగిపోయాడు; నిన్ను

తిరిగి స్వీకరించడానికి సమ్మతించి నాచేతే నిన్నురమ్మని వర్తమానం పంపించాడు ... దేవీ! నేను నా శరీరాన్ని త్యాగంచేశాను, నాతల్లికోసం — అందులో తప్పుగాని, పాపం గాని కనిపించలేదు నాకు ; ఒకవేళ పాపమే అయితే నరకఫలం రావచ్చు; దానికి కూడా సంసిద్ధురాలనై వున్నాను నేను. నీసౌఖ్యంకోసం నేను నరకాగ్నిలో దహించుకుపోయినా నాకేమీ చింతలేదు — నీచే పోషింపబడ్డాను ; నీవు నీచెల్లెలిలాగ ఆదరించావు నన్ను. ఈ శరీరం నీది; నీకోసం నా ఆత్మనైనా బాధలేకుండా ఇచ్చెయ్య గలను; నాకీ శరీరత్యాగ మెంత దేవీ! — దేవీ! వేరుగా తలచవద్దని ప్రార్థిస్తున్నాను...

వసంతసేన :

వసుమతీ! ఎంతపని — ఎంత త్యాగం చేశావు నాకోసం! ఆశ్చర్యం నీ అనురాగానికి కృతజ్ఞురాలిని! లోకాతీతమైన కార్యం చేశావు. అమ్మా, వేరుగా ఎలా తలుస్తాను? నాకు తెలియదూ నీ నిర్మలస్వభావం? నేను నీ మహాసాహసానికీ, నీ స్వార్థ రాహిత్యానికీ విభ్రాంతనై మెచ్చుకుంటున్నాను — [ఆమెశిరమును వాత్సల్యముతో నిమురును]

వసుమతి :

దేవీ! ధన్యురాలిని.

వసంతసేన :

నన్నొక్కదానినే రమ్మనేనా అశోకుని వర్తమానం?

వసుమతి :

అవును — కాదు —

వసంతసేన :

కబు రేమని అసలు ?

వసుమతి :

"నిన్ను తిరిగి పరిగ్రహిస్తాను. గతంమరిచిపోయి నీయింటి పేరు నిలవబెట్టి ప్రపంచంమాట తలచి నీ కొడుకుకోసమైనా తిరిగి రాగోరుతున్నాను." అని అశోకుడు చెప్పమన్నాడు.

వసంతసేన :

[వికటమగు చిఱునవ్వుతో] అంత తేలికా ? —విక్రమార్కుని విడిచి రమ్మనేనా దాని సంగ్రహము ?

వసుమతి :

ఔ నమ్మా.

వసంతసేన :

అసంభవము.

వసుమతి :

నీ ఆదర్శప్రేమనిగురించి ఆతనితో చెప్పేను ; కాని, అతని కర్థ మవడం కష్టం. విక్రమార్కుడుకూడా తన యింట్లో వుండడాని కతని కెంతమాత్రం ఇష్టంలేదు. పేరుపోతుందని సందేహం అట — కాని,

వసంతసేన :

పేరు నిలబడితే చాలుట, ఈప్రపంచంలో వుండే అజ్ఞానంకోసం నశించిపోవచ్చు గాని. పేరు....

వసుమతి :

కాని, దేవీ! నువ్వు ప్రతిదినమూ విక్రమార్కుణ్ణి నీయింట్లో కాక మరొకచోట ఎక్కడైనా రహస్యంగా చూడవచ్చు.

వసంతసేన :

వసుమతీ! రహస్యంగా చూడడానికి ఇదేమైనా తప్పా? నా కది ఇష్టం లేదు; నా దివ్యప్రేమని బహిరంగంగా ప్రకాశించనియ్యి; లోకా లన్నింటిలోనూ మాప్రేమని తాండవించనియ్యి. మే మీ లోకం విడిచిపెట్టి ఇంకొకలోకానికి వెళ్ళి ఇప్పుడు ఇటువంటి అలౌకికప్రేమ భూలోకంలో వొకమారున్న దని ఎవరో కొందరైనా గ్రహించి తీరతారు — వసుమతీ! నేను విక్రమార్కుణ్ణి విడిచి ఎప్పటికీ రాను; ఒక్కనిమిషమేనా అతన్ని విడిచి వుండలేను. అతడే నాకు సర్వస్వం —

వసుమతి :

దేవీ! తొందర పడకు.

వసంతసేన :

తొందర లెందుకు?, సత్యానికీ, స్వచ్ఛప్రేమస్నాతమైన హృదయానికీ తొందరలేదు; ఆలస్యంలేదు. నా నిశ్చితాన్ని చెప్పేను. దీని కింక తిరుగులేదు.

వసుమతి :

అయ్యో, దేవీ! [ఆమె హస్తములు గ్రహించి] మీ రిద్దరూ ఎన్నాళ్ళిలా నిరాధారులై తిరుగుతారు? ఎక్కడికి వెడతారు! ఏం చేస్తారు?

వసంత సేన :

ఇంత విశాలమైన విశ్వప్రపంచంలో మాకు తావే వుండదూ ? ప్రేమస్వరూపుడైన భగవంతుడు మమ్మల్ని కాపాడడా? మా ప్రేమే మాకు సర్వానందమూ ఇస్తుంది. మే మన్యోన్యమూ చేయతగిన పనులెన్నో వున్నాయి — అమ్మా, భయపడక : వెళ్లు.

వసుమతి :

[ఏడ్చుచు] దేవి ! నేను నిన్ను విడిచి వెళ్లలేను —

వసంత సేన :

నా కోసం నీ శరీరాన్ని అర్పించిన దానవు, నా కోసమే యీ పనిని చెయ్యలేవూ ! నా కొడుకుని జాగ్రత్తగా పెంచు —

వసుమతి :

దేవీ ! అతనిని చూసినప్పుడల్లా నా గుండె చెరువై పోతుంది.

వసంత సేన :

[కంటినీటి నరికట్టుచు] నాకుమట్టుకు కుమారుని విడిచిపెట్టి వుండడం కష్టంగా వుండదూ ! అతన్ని మాదగ్గరే ఉంచుకోవాలని ఎంతవుంటేమాత్ర మేమిలాభం ?

వసుమతి :

న్యాయశాస్త్ర ప్రకారం నీ కొడుకు నీ భర్తహక్కుట ! ఆ హక్కును నీ భర్త వదిలిపెట్టడు.

వసంత సేన :

నాకు తెలుసును. అయినా — నా బిడ్డ నొక్క సారి చూడడానికి వీలుంటే ఎంత బాగుండును !

వసుమతి :

నేను తప్పకుండా ప్రయత్నిస్తాను, దేవీ —

వసంత సేన :

వసుమతీ! నీకు నే నెంత కృతజ్ఞురాలినో తెలియ జెప్పడం ఎలా?

వసుమతి :

అమ్మా, నే నేం చెయ్యగలిగాను! నా ప్రయత్న మంతా నిష్ఫలమై పోయింది.

వసంత సేన :

దైవసన్నిధిని సత్కార మెప్పుడూ ఫలహీనం కాదు.

వసుమతి :

[ మౌనము ]

వసంత సేన :

మళ్ళీ ఎన్నాళ్ళకీ ప్రాంతాలకి తిరిగి వస్తానో తెలియదు. నా బిడ్డమాత్రం జాగ్రత్త సుమీ — నీదగ్గరుంటే నాకింకేమీ బెంగలేదు వాడిక్షేమంగురించి; నేను స్వయంగా చూచుకున్నట్టే తృప్తిగా వుంటుంది నాకు. మళ్ళీ ఎన్నాళ్ళకో నిన్ను చూడడం — [ ఒకవిధమైన చిఱునవ్వు ] వసుమతీ! నువ్వుకూడా నీ ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకో అమ్మా — ధనంవిషయం సందేహ మక్కర్లేదు : నీపేర బ్యాంకులో ధన ముంది.

వసుమతి :

[కన్నీటితో] దేవీ! నువ్వు లేనిదే నాకివన్నీ యెందుకు తల్లీ — [దుఃఖించును].

వసంతసేన :

చూడు అమ్మా, ఏడవకు. నా దివ్యప్రేమకీ, నా మహానందానికీ సంతోషించు.

వసుమతి :

దేవీ ! ఎక్కడకి ప్రయాణం ?

వసంతసేన :

ప్రపంచయాత్ర కని బయలుదేరుతున్నాము, మే మిద్దరమూ.

వసుమతి :

ఎన్నాళ్ళు, అమ్మా ?

వసంతసేన :

తెలియదు.

వసుమతి :

తిరిగి వచ్చి ఎక్క డుంటారు ?

వసంతసేన :

తెలియదు.

వసుమతి :

అయ్యో !

వసంతసేన :

ప్రస్తుతం ప్రపంచయాత్ర కని బయలుదేరుతున్నాం. చూడూ, రేపురాత్రి మా స్టీమరు బయలుదేరుతుంది ; ఆలోపున నీ వొక్కసారి నా బిడ్డని చూపించవూ ?

వసుమతి :

అమ్మా, నా యావచ్ఛక్తీ వినియోగిస్తాను.

వసంతసేన :

[మౌనము]

వసుమతి :

దేవీ ! నువ్వు దూరమైపోతున్నావనే బాధ వొకటీ, జనుల మాటలు వినలేక బాధ వొకటీ...

వసంతసేన :

జనుల మాటలు లెక్కచెయ్యకు. వాళ్లువెంత నన్ను నిందిస్తే అంత ఉత్కృష్టచరిత్ర కలదాన్నని సంతోషిస్తాను. సంఘం మాటలకేం — వాట్లకి హృదయం లేదు; సత్యం లేదు —

వసుమతి :

అవును — నిన్ను దూషించే స్త్రీలవీ పురుషులవీ రహస్య ప్రవర్తనలు నాకు తెలియవూ ? — నిరర్థకములు, నీచములు, తుచ్ఛములు —

వసంతసేన :

అలాంటి వాళ్లే ఇతరుల్ని ముందు నిందిస్తారు. వాళ్లలాగే నేనుకూడా అందరినీ, లేనిప్రేమని ప్రదర్శించి మోసంచేస్తూ, ఎవరినీ నిజంగా ప్రేమించక, కేవలం విషయభోగాలతో కాలం గడపడం లేదని వాళ్లందరికీ నామీద అసూయ, కోపం — నిజమైనప్రేమా, దాని ఆనందం, వాళ్లకేం తెలుసు ?

వసుమతి :

ఔను.

వసంతసేన :

వాళ్లలాగకాక, బహిరంగంగా దైవసన్నిధిని నేను హృదయపూర్వకంగా ప్రేమిస్తోన్న నాప్రాణప్రియుడితో వెడుతోన్నందుకు నేను కులట నట; వాళ్లు పతివ్రతలట — ప్రపంచం !—

వసుమతి :

దేవీ !

వసంతసేన :

వసుమతీ ! నా బిడ్డనిమాత్రం ఈ పాపప్రపంచంలో వుండే జనులలో వొకణ్ణిగామాత్రం కానివ్వకు ; కాపట్యాన్ని చేరనియ్యకు — సత్యవాదిగా, సత్యవర్తనుణ్ణిగా, దైవభక్తుణ్ణిగా చెయ్యి; ఈ పాపిష్టిసంఘాన్ని తన దివ్యవర్తనంచేత ముక్కముక్కలుగా చేసి సత్యాన్ని, సత్యమైనప్రేమనీ స్థాపించే వాణ్ణిగా చెయ్యి. ఇంకొకమాట — తనతల్లియొక్క పూజ్య ప్రేమని, దానిసంబంధమైన త్యాగంవీమైనా వుంటే దాన్ని గ్రహించేట్లు చెయ్యి —

వసుమతి :

తప్పకుండాను — దేవీ ! —

వసంతసేన :

ఏం ?

వసుమతి :

నువ్వు వివాహం చేసుకుంటే —

వసంత సేన :

వీలులేదు — ప్రస్తుతం హిందూమతంప్రకారం చేయబడ్డ వివాహాలలో స్త్రీ ఎంతకష్టించి నశించినా ఆమెకి విడాకులులేవు. న్యాయశాస్త్రంకూడా వివాహిత అయినస్త్రీ ఇంకొక ర్నెంత ప్రేమించినా అతన్ని వివాహంచేసుకోడానికి అనుమతివ్వదు, చూశావా ?

వసుమతి :

ఎంత ఘోరం !

వసంత సేన :

ఘోరమా మహాఘోరమా ? ఏమతప్రకారమైనవివాహాలకైనా విడాకులు — కొన్నిపరిస్థితులలో షరతులు లేని సంపూర్ణమైన విడాకులు — ఉంటేనేగాని సంఘంలో సౌఖ్యం వుండదు.

వసుమతి :

విక్రమార్కుడో మరి ?

వసంత సేన :

అతను 'రెజిస్ట్రేషన్' ప్రకారం వివాహంచేసుకోబట్టి వాళ్ల వివాహబంధం వీడిపోవడానికి వీలుండిఉండవచ్చు.

వసుమతి :

[మౌనము].

వసంత సేన :

కాని, నాకు ప్రపంచంకోసం చేసుకునే వివాహం అంత ముఖ్యం గాదు. ఎప్పుడైతే నేనూ విక్రమార్కుడూ అన్యో

న్యమూ ప్రేమించుకున్నామో ఆ క్షణాన్నే మాకు దివ్య వివాహం అయింది.

వసుమతి :

దేవీ ! నీ ప్రేమ పూజ్యమైనది; ఆశ్చర్యకరమైనది. అద్వితీయము; అపూర్వము —

వసంత సేన :

అమ్మా ! నువ్వు నాకోసం చేసిన కార్యం మహాశ్చర్యకరమైనది; నీ త్యాగానికి జగత్తంతా కంపిస్తుంది — [ఆమెహస్తమును స్పృశించును.]

వసుమతి :

దేవీ !...

వసంతసేన :

ఏం ?

వసుమతి :

నేను వేరు గృహంలో వుండి నీ కొడుకుని అశోకుడి గృహంలో జాగ్రత్తగా పెంచి సేవచేస్తూ, నీ రాక కెదురు చూస్తోంటాను, ఎన్ని సంవత్సరాలైనా.

వసంతసేన :

కృతజ్ఞురాలివి.

వసుమతి :

ఒకమాట — నీకోసం నా శరీరాన్ని అశోకుడి కర్పించాను. కాని, ఇంక దానినిబట్టి అతడు మళ్లీ నా దగ్గరకి రాలేడు ; నే

నతన్ని తిరిగి స్పృశించనైన స్పృశించను. నా హృదయ మతనిది కాదు. అగ్ని ఎలాగ భయంకరమై తాకడాని కసాధ్యమయిందో నేనూ అంతే.

వసంతసేన :

నువ్వు మహోత్తమురాలవు.

వసుమతి :

[లేచి] దేవి ! సెలవు —

వసంతసేన :

[లేచి] వసుమతీ ! రేపు రాత్రిలోపున నా కొడుకుని తీసుకొచ్చి నాకు చూపిస్తావా ?

వసుమతి :

[కన్నీటిలో] నా యావచ్ఛక్తి వినియోగిస్తాను.

వసంతసేన :

ఇంక వెళ్ళమ్మా.

వసుమతి :

[నమస్కరించి నిష్క్రమించును.]

వసంతసేన :

[గవాక్షమును తెఱచి వీక్షించుచుండును.]

విక్రమార్కుడు :

[ప్రవేశించి] వసంతసేనా ! — ప్రేయసీ !

వసంతసేన :

[వెనుకకు జరిగి] ఏం, ప్రియా !

విక్రమార్కుఁడు :

వసుమతి నీ నిశ్చయాన్ని నా కెరిగించింది.

వసంతసేన :

[చిఱునవ్వు]

విక్రమార్కుఁడు :

[సమీపించి యామె హస్తమును గ్రహించి.] ప్రాణప్రియా ! నీ ప్రేమచేత నేను ధన్యుడ నయాను. నా జన్మ తరించింది. కాని, నిన్ను నీ భర్తనుండి వేరుచేసి, కొడుకునకు దూరముచేసి, గృహము విడిచిపెట్టించి, నాతో తీసుకొని వెళ్ళడం భావ్యం కాదేమో అని నాకు దిగులుగా వుంది — నా కెంతకష్టమైనా, నా సుఖానికి స్వస్తి ఇచ్చి అయినా, నేను నరకబాధలను భవిస్తున్నా, నేను కృశించిపోయినా, నా ఆత్మ నశించిపోయినా నువ్వు సుఖంగా వుంటే నా కదేచాలు — వసంతసేనా ! నామాట విని —

వసంతసేన :

[వికటముగ నవ్వి] నిన్ను విడిచి సుఖం అనేదీ, ప్రాణం అనేదీ నాకు లేదే !

విక్రమార్కుఁడు :

పోనీ, నీ బిడ్డకోసమైనా —

వసంతసేన :

[తీక్షముగ] ఏం, వెళ్ళిపొమ్మంటావా ?

విక్రమార్కుఁడు :

అది కాదు —

వసంతసేన :

[ఉద్రేకముతో] "అది కాదు, ఇది కాదు" అని చుట్టుత్రోవ త్రొక్కడ మెందుకు? "నీతో పని తీరింది; వెళ్ళిపో" అని చెప్ప కూడదూ?

విక్రమార్కుఁడు :

ప్రాణప్రియా! ఆగ్రహం వొద్దు. మనప్రేమకి అయిపోవడ మనేది లేదే. నువ్వు తప్పభిప్రాయపడ్డావు. మనం దైవసాన్ని ధ్యాన్ని — ఎన్నికష్టాలు వచ్చినా, ఈ లోకంలో, మృత్యువులో, తరవాత ఎప్పటికీ, ఏలోకంలో ఏవిధంగా వున్నా, శాశ్వతంగా అనంతకాలంలో ప్రేమించుకుంటూ విడవకుండా వుంటా మని శపథం చేసుకో లేదూ? నా ప్రేమ గ్రహించలేదూ నువ్వు ?

వసంతసేన :

అలాంటిప్రేమకి ఎటువంటి అంతరాయం గాని, ఎడబాటు గాని వుండకూడదే మరి !

విక్రమార్కుఁడు :

అవును; అంతరాయం లేదు. — ఎడబాటు కొంతవరకూ ఈ లోకంలో వున్నా ప్రేమకి అంతరాయం లేదు.

వసంతసేన :

కొంచెమైనా, వొక్కక్షణమైనా నేను ఎడబాటు సహించలేను.

విక్రమార్కుఁడు :

నేనుమాత్రం సహించగలనా ?

వసంత సేన :

అయితే అలా గన్నా వెందుకు మరి ?

విక్రమార్కుఁడు :

నాకు గుండె బ్రద్దలైనా నీ శ్రేయస్సును కోరి —

వసంత సేన :

నా శ్రేయస్సా? — నిన్ను వీడి నా కేమీ లేదే! నువ్వు లే నప్పుడు దైవ మున్నా లేకపోయినా నాకు సంబంధం లేదు — నేను కని పెంచిన నా ప్రియపుత్రుణ్ణి కూడా నీకోసం, మన ప్రేమకోసం నిస్సంకోచముగా విడిచి పెట్టనే! — ఇంకా ఇలాంటి మాట లని నా హృదయాన్ని దహించకు... [కన్నీరు దుడుచు కొనును.]

విక్రమార్కుఁడు :

[ఆమెను కౌఁగిలించుకొని] హృదయ దేవతా! క్షమించు. నీకు ప్రపంచంలో కల్లోలం కలగకుండా అలా గన్నాను. అంతేకాని నా ప్రేమ నీకు తెలియదూ ?

వసంత సేన :

నీ సాన్నిధ్యంలో నాకు కల్లోలం లేదు — అంతా శాంతి. అంతా ఆనందం—నిన్ను తొందరతో అన్నమాటలకి క్షమించు.

విక్రమార్కుఁడు :

దానికేం — నీవంటి స్త్రీచేత యీ విధంగా ప్రేమించబడి,

ఈ విధంగా నిన్ను ప్రేమించగలిగిన నేను ధన్యుణ్ణి. మహారాజాధిరాజులపదవికంటె మహోన్నతమైన పదవిలో నేను ఉత్కృష్టుడనై వున్నాను. వసంతసేనా! నువ్వు నాకు దేవతవు. [ఆమె పాదమును జుంబించును——ఆమె వారించును.] వారించకు — సర్వమూ దివ్యము.

వసంత సేన :

ప్రాణాధిదేవతా! మహానందంలో నాకు ఏలోకం యేదో తెలియడం లేదు — ధన్యను.

విక్రమార్కుఁడు :

వసంతసేనా! ప్రేయసీ! కృశించిన హృదయాన్ని వికసింప జేశావు! మరణించిన దానిని తిరిగి జన్మింప జేశావు. జీవనమే తెలియనిదానికి జీవన మిచ్చావు — నీ వొక్కదానవే నాకు సర్వము.

వసంత సేన :

[ అతనిఁ ప్రేమతోఁ జూచుచుండును. ]

విక్రమార్కుఁడు :

౻ంతసేనా! ఈ లోకంలో మన కెంత మందో అడ్డు వస్తూంటారు — నాకు భార్య వుందనీ, నీకు భర్తవున్నాడనీ మన దివ్యసంబంధం న్యాయ విరుద్ధ మనీ, అనేక ఆటంకాలు కలుగ జెయ్యడానికి ప్రయత్నిస్తారు —

వసంత సేన :

ప్రయత్నిస్తే మట్టుకు మన కేం?

విక్రమార్కుఁడు :

మన ప్రేమకి అడ్డు వుండదు. కాని మనకి వియోగం కలుగ జెయ్యడాని కనేక ప్రయత్నాలు చేస్తారు.

వసంతసేన :

అప్పుడు ?

విక్రమార్కుఁడు :

అప్పుడు మన మీ లోకంలో జీవించడమే దుర్భర మేమో!

వసంతసేన :

[ చిరునవ్వుతో ] మన కీ లోకం తప్ప ఇంక లోకాలే లేవా? ఏ లోకం అయితేనేం మనకి?

విక్రమార్కుఁడు :

[ తలయూఁపి ] నా హృదయభావం నీ హృదయంలో ప్రతి ధ్వనించింది.

[ ఇరువురు నడచి సోఫాపైఁ గూర్చుందురు. ].

విక్రమార్కుఁడు :

[ ఆమెను జూచుచు ] నీ రూపానికి ముగ్ధుణ్ణయిపోతున్నాను.

వసంతసేన :

[ ముఖము చేతులతోఁ గప్పికొని ]పరకీయను అలా చూడవచ్చా? లోకు లే మను కుంటారు ?

విక్రమార్కుఁడు :

[ఆమెచేతులను దీసి చుంబించి]పరకీయవు కావు — దైవదృష్టిలో స్వకీయవు ! [ ఆమెకన్నులలోనికిఁ బ్రేమార్ద్రమగు దృష్టితోఁ జూచుచు]

దివ్యమూర్తి! సర్వమానవకోటీ సర్వలోకాలూ నశించినా, నువ్వు దైవానుగ్రహంచే సురక్షితవై వుంటే నాకదే చాలు.

వసంతసేన :

మనకీ, మనప్రేమకీ దైవమే ఎప్పటికీ దిక్కు.

విక్రమార్కుడు :

[ శిరఃకంపము ]

వసంతసేన :

దివ్య ప్రేమలో ఎంతో స్వార్థపరత్వమున్నా, ఎంతో స్వార్థరాహిత్యంకూడా వుంది.

విక్రమార్కుడు :

రెండింటినీ దాటినది కూడాను.

వసంతసేన :

[ అంగీకారసూచకముగఁ దల నూఁపును ]

[ తలుపు తట్టఁబడును ].

వసంతసేన :

రావచ్చును.

విక్రమార్కుడు :

[ వెడలి తలుపుఁ దీయును. అనసూయ ప్రవేశించును. ]

వసంతసేన :

[ లేచి ] దయచెయ్యండి —

అనసూయ :

[ ఆమెను జూచి ] విక్రమార్కుడితో మాట్లాడ్డానికి వచ్చాను— ఒకవిషయం రహస్యంగా.

వసంతసేన :

కూర్చోండి — నేను ప్రక్కగదిలోనికి వెడతాను. [వెడలఁ బోవును.]

విక్రమార్కుఁడు :

వసంతసేనా! నువ్వు దయవుంచి యిక్కడే వుండాలి. [అనసూయను జూచి] వసంతసేన కన్ని విషయాలూ తెలుసును; ఆమెదగ్గర నా కేటువంటి రహస్యాలూ లేవు —

అనసూయ :

[విక్రమార్కునిఁ జూచి] నిన్ను చూడడానికి వచ్చాను. [వసంతసేనవైపు చూచును.]

వసంతసేన :

అవును, నన్ను చూడడానికి రాలే దని నాకు తెలుసును. [గంభీరమగు చిఱునవ్వు.]

విక్రమార్కుఁడు :

నన్ను మాత్రమే చూడాలని వస్తే మీశ్రమ వృథా — అది అసంభవము.

అనసూయ :

విక్రమార్కా! వసంతసేనా! వేరే భావించకండి — విక్రమార్కునితో వొకసంగతి చెప్పమని ఆతని తండ్రి పంపించాడు నన్ను. అది చెప్పేసినతరవాత మిమ్మల్నిద్దర్నీకూడా చూడాలనే వచ్చాను.

వసంతసేన :

కూర్చోండి, విక్రమార్కా! ఇప్పుడే వస్తాను.

విక్రమార్కుఁడు:

క్షమించి కొద్ది నిమిషాలు కూర్చో మని ప్రార్థన.

అనసూయ :

[కూరుచుండి] వసంతసేనా ! నే చెప్పేదాని కేమీ అనుకో వద్దని కోరుతున్నాను.

వసంతసేన :

[నవ్వుచు] దాని కేముంది — [కూర్చుండును.]

అనసూయ :

విక్రమార్కా ! మీతండ్రి చాలా నొచ్చుకున్నాడు నీనడత చూసి: వంశానికి అపకీర్తి వచ్చిందే అని వాపోయాడు, సంగ తంతా విని. అతడు పెద్దవాడు — నీతో వొకమాట చెప్ప మన్నాడు: నీభార్య మళ్ళీ నీదగ్గర కొచ్చి ఎల్లప్పుడూ నువ్వు చెప్పినట్టు నడుచుకుంటుందిట. నువ్వుమళ్లీ ఇంటికి వచ్చి పూర్వం లాగే వుంటూంటే తన ఆస్తి నంతా నీ కిచ్చేస్తాడట — గతం మఱచిపోవచ్చును.

విక్రమార్కుఁడు :

నా కేమీ అవసరంలేదు. ఇదే నా సమాధానము.

వసంతసేన :

విక్రమార్కా ! తొందరపడకు.

అనసూయ :

వసంతసేన నీ మంచి కోరేదేగదా — ఆమె చెప్పినట్టు కొంచెం జాగ్రత్తగా ఆలోచించు.

విక్రమార్కుడు :

నా నిశ్చయం చెప్పేను – అది ఇంక మారదు – వసంతసేనా ! – [ఆమెపై ప్రక్కకు జరుగును].

వసంతసేన :

నా హృదయం నీకు తెలియదూ ?

విక్రమార్కుడు :

ఔను.

అనసూయ :

స్నేహితులం మేము ప్రజల మాటలు వినలేకపోతున్నాం.

వసంతసేన :

నావంటి దుశ్చరిత్ర శ్రీ దసేనా ?

అనసూయ :

ఏదో అనుకుంటుంది ప్రపంచం. [అసహనమును జూపించును.]

వసంతసేన :

దాని కేం –

అనసూయ :

వసంతసేనా! ఒకమాట చెబుతున్నాను: నీ భర్త నీకు విడాకు లివ్వడు అలా చెయ్యడానికి వీలున్నప్పటికీ; ఇలా వుంటే నిన్ను కష్టపెట్టడమే అతని వుద్దేశం. చూడండి, మీా కనేక ఆటంకాలు కలుగుతాయి – చిన్నవాళ్ళు ; బాగా ఆలోచించుకోండి. మీా మేలు కోరే చెబుతున్నాను.

వసంతసేన :

[చిఱునవ్వు.]

విక్రమార్కుడు :

[మౌనము.]

అనసూయ:

ఎంతప్రేమ వున్నా మనం ప్రపంచానికి కొంచెం జడియ వొద్దూ —

వసంతసేన:

[చిఱునవ్వు.]

అనసూయ:

[లేచి] నాకు పనుంది. విక్రమార్కా! కొంచెంఆలోచించవూ?

విక్రమార్కుడు :

నేను చెప్పింది బాగా ఆలోచించే చెప్పేను; అదే నా నిశ్చయం. నేను వసంతసేనని విడిచిపెట్టి వుండను; ఉండలేను.

అనసూయ :

సరే. కాని, ఇంకోమాట—నీకు ప్రభుత్వంలో వొకఅమాత్య పదవి యిస్తారట; ప్రధానమంత్రికి నీశక్తి తెలుసునుగా, కాని, ఈస్థితిమాత్రం మారవలసి వుంటుంది.

విక్రమార్కుడు :

ఈ స్థితి మారదు; నాకమాత్యపదవి అవసరంలేదు.

అనసూయ :

సెలవు — జాగ్రత్త. చిన్నవాళ్ళు. మీకే సలహా కావలసివచ్చినా నన్నడగవచ్చు; మీ క్షేమం కోరేదాన్ని నేను.

వసంతసేన :

[లేచి] సెలవు.

విక్రమార్కుఁడు :

[తలుపుతీసి] సెలవు.

[అనసూయ యిరువుర నాశ్చర్యముతోఁ జూచుచు వెడలును. విక్రమార్కుఁడు తలుపువేయును. – వసంతసేనను జూచి చేతులు జాచును: వసంతసేన యతని వక్షమును జేరును.]

తెర

---

# ఆ లోకమునుండి ఆహ్వానము

## చతుర్థాంకము.



[ప్రవేశము : ఓడరేవునకు సమీపమున సముద్రతీరము – ప్రవేశము : ఇరువురు చేఁపలను బట్టువాండ్రు వలను మోయుచుఁ, బాడుచు. ]

పాట :

ఐలేస ఐలేస ఆయాసమే లేదు,
ఐలేస ఐలేస ఆయాసమే లేదు –
పడ వెక్కి యెల్తాము, పాటల్ని పాడతాం,
తెరసాప పైకెత్తి, తిన్నగా పోతాము –
ఐలేస ఐలేస ఆయాసమే లేదు –
కెరటాలు సూస్తాము, కేరింత లేస్తాము,
సందరంలోపలికి సరియెల్లి పోతాము –
ఐలేస ఐలేస ఆయాసమే లేదు –
సిన్న సేపలు తెస్తాం, సితక సేపలు తెస్తాం,
కొద్దిసేపలు తెస్తాం, పెద్దసేపలు తెస్తాం.
ఐలేస ఐలేస ఆయాసమే లేదు –
సల్లగా యెలతాము, సల్లగా వస్తాము.
సల్లనీన్ని మాతల్లి సల్లగా సూడవే –
ఐలేస ఐలేస ఆయాసమే లేదు.
ఐలేస ఐలేస ఆయాసమే లేదు –

[ఇరువురు వలను గ్రిందఁ బడవైతురు.]

మొదటివాఁడు :

ఒరే! గాలి మా బీకరంగా యాస్తందిరా!

రెండవవాఁడు :

ఓరి నాయనో, కెరటాలు కొండ కంటేలా గున్నాయిరా!

మొదటివాఁడు :

నా నప్పిడే అనుకున్నా(న్రా, ఈమూల వోల పడదని; గుమ్మం దాటేతలికి పిల్లి ఎదు రయిందిరా.

రెండవవాఁడు :

పద, ఇంటికి పోదారి — ఇలాంటి సముద్రంలో యెత్తే మనకోసం మనోళ్ళు నీ ల్లొదలాలిసిందే — ఒరే, మేగంకూడా మాదట్టంగా పడతందిరా.

మొదటివాఁడు :

అంతా తుపాను లచ్చనాలు రా —

రెండవవాఁడు :

ఒరే, కాలం గాని కాలంలో ఈ తుపా నేంటిరా?

మొదటివాఁడు :

కాలమే మారిపోయిందిరా!

రెండవవాఁడు :

రా, పోదారి.

మొదటివాఁడు :

ఉండాసి, ఒక సుట్ట తాగి మరీ పోదాం – అప్పిడే వా నొచ్చీలాగలేదు. [మొలనుండి రెండు పొగచుట్టలు తీసి, యొకటి రెండవవాని కిచ్చి] నిప్పియ్యరా. [కూరుచుండును.]

రెండవవాఁడు :

[కూరుచుండి, యక్కడఁ గాలుచున్న తూటకట్టతో రెండుచుట్టలను అంటించును ; ఇరువురుఁ జుట్టలఁ గాల్చుచుందురు.]

ఒరే, అలా నూడు — ఈ రాతిరి వొక సెద్దస్టీమరు బయలు దేరతందిరా ; మా బాగుంది, అయిగో దీపాలు కనిపిస్త న్నాయి తోరణాల్లాగ, నూడు.

మొదటివాఁడు :

తెల్లోడి మాయరా !

రెండవవాఁడు :

ఆడేం జేసినా మాయేరా ! — లేకపోతే తుపాను కూ్కాడా జడవకుండా పోనిస్తుండాడే యీ స్టీమర్లని !

మొదటివాఁడు :

ఒరే, మాయంటే గేపకాని కొచ్చింది — నిన్న జండా లొట్టుకొని పదా లాడుకుంటూ ఆడోళ్ళూ మొగోళ్ళూ కలిసి గొల్లున వచ్చార్రా మన పల్లెకి, కాంగెరెసోళ్ళంట. ఈ తెల్లోళ్ళ మాయల్లో పడకండి, ఈ తెల్లోళ్ళ మాయల్ని రూపు మాపే స్తాం అంటూ ఏ యేమో సెప్పేసేర్రా, నాకు బాగా తెలిసింది కాదు.

రెండవవాఁడు :

ఆళ్ళని మించిన మాయ ఈళ్ళదిరా. ఎవణ్ణి ఎవడు నమ్మి సచ్చాడురా యీకాలాన్ని ? ఈయేల ఇంకో జట్టొచ్చిం దిరా — నిన్న కాంగెరెసోళ్ళు వోట్లు కోస మొచ్చారా ; ఇయేల ఆళ్ళకి వోట్లియ్యొద్దని యీ ళ్ళొచ్చార్రా !

మొదటివాఁడు :

ఇదంతా గాడిదగత్త్రరా. ఎందు కొచ్చినగోల, మన పెద్ద కాసులు ఊరుకుంటాడుగాని చేనే పెద్దనై తేనా, ఈ వోట్లు కోస మొచ్చే గాడిదకొడుకుల్ని ఆమడదూరం తరి మెయ్యా నురా! — ఒక్కే, అళ్లు సెప్పుతున్నంతసేపూ బాగానే వుంటది గాని, తరవాత సూస్తే ఎవ్వడూ ఏం సెయ్యడురా.

రెండవవాఁడు :

నిజమే, కాని —

మొదటివాఁడు :

'కానీ' ఏంటిరా? సూడు — ఇన్నివోట్లు ఇన్నిసార్లింత మంది కిచ్చాం గందా, మన కెవడే ముపకారం సేశాడంట? మనకి పన్నులు తగ్గేయా, మనకి పంటలెక్కువయ్యాయా? ఎవ డొచ్చినా వోకటే!

రెండవవాఁడు :

నిజమేరా, మన సముద్రంతల్లి సల్లగా వుండి వోల బాగా పడాలిగాని. మన క్కావలసిం దది — కాని, ఈ వోట్ల గోడ వల్లో వోక లాభ మున్నాదిరా —

మొదటివాఁడు :

ఏటది?

రెండవవాఁడు :

నల్లమందు కరుసు కలిసొత్తుందిరా! [కన్ను గీటును.]

మొదటివాఁడు :

నీ సిగతరగా! మైరావణ ముండా కొడుకువురా!

రెండవవాఁడు :

ఒరే, మా గమత్తు సేశాను.

మొదటివాఁడు :

ఏంటి ?

రెండవవాఁడు :

రెండు పారిటీలోళ్లకీ టోపీ యేశాను — ఈళ్లకీ ఓటిస్తా నన్నా, ఆళ్లకీ ఇస్తా నన్నా, ఇద్దరూ సెయ్యి తడిపేరు.

మొదటివాఁడు :

వోళ్లకిస్తా వేంటి మరి ?

రెండవవాఁడు :

ఆడికీ ఇవ్వాను, ఈడికీ యివ్వానాస్.

మొదటివాఁడు :

ఆరిని ! అన్నాయం కాదంట్రా ? మరి కాసులేమంటాడు ?

రెండవవాఁడు :

ఓడురా ఇప్పుడు నాయమాలోసించే వోడు? కాసులు కూడా మనిట్టం అన్నాడు, ఈగొడవంతా ఎందుకని.

మొదటివాఁడు :

ఒరే, ఒరే దూరాన్నోరిదో కారాగిందిరా. ఓళ్లో దిగు తుండారు కూడాను.

రెండవవాఁడు :

ఒరే, మొన్న ఇది గిలాంటిమూలే వొక దొరా దొరచానీ కారుమీాద మన పడవకాడికొచ్చి, యెన్నెల బాగుంది,

పడవసికారు తీసికెల్లమన్నార్రా; రెండురూపాయిలిచ్చారు. సరే అని తీసికెల్లేను. అదే చమయానికి సీమకెల్లీ వోడ కూడా బయదెల్లింది. స్టీమరు, సుట్టూతిరిగొచ్చేతలికి మేము దాన్ని కల్చుకొన్నాం రా. దానిమీద దొర్లూ, దొరచానులూ కావు లించుకొని నైతె తక్కలాడుతున్నార్రా!

మొదటివాఁడు:

అది డాన్సంటార్రా; అదో ఆట.

రెండవవాఁడు:

నీ మొఖం! తప్పతాగి గంతులేత్తుంటే ఆటేంటిరా? అందులో ఆడాళ్లూ మొగోళ్లూ కల్చి నేత్తుంటే ఆటేంటిరా?

మొదటివాఁడు:

అది మనకి తెలీదు లేరా.

రెండవవాఁడు:

చరే కాని, వోరే, తరవా తిను; మల్లా తిరిగిపడ వొడ్డట్టిత్తుండాను. గంతలో ఏమయిందనుకుండావు? — నా పడవలో వున్న దొరా దొరచానీ వోళ్లమీా దోళ్లు వొరిగిపోయి మూతీ మూతీ కలిపి పెద్దయుద్ధం నేసినంత పనిసేసి సచ్చినట్టు కల్లు తేలేసేర్రా! నాకు, చెప్పొద్దూ, ముందు బయమేసింది; తరవాత వోల్లంతా చెమట్లోశాయిరా, అదో మోస్తరైపోయిందిరా మనసు!

మొదటివాఁడు:

అది తెల్లోళ్ళ పద్దవతిరా.

రెండవవాఁడు :

నేనిదివఱకు విన్నాగాని అదే నేను ముందుగుండా సూస్తాం. కాని మనకి సరిపోదాస్ కొంచె మైనా !

మొదటివాఁడు :

ఏ మయిం దేంటిరా ?

రెండవవాఁడు :

ఒరే, ఒవళ్ళతోటీ సెప్పకేం !

మొదటివాఁడు :

ఒ ట్టేస్తారా.

రెండవవాఁడు :

ఆళ్ళని నెమ్మదిగా ఎలాగోలాగ వొడ్డుని దింపేసి నే నింటి కెళ్లేనురా — మాంచి వుబలాటంగా వుంటే, ఇంటి దాని మీద తెల్లోడి తమాసా సూపిద్దా రని కలబడినంత పనిసేసి తెల్లోళ్ళలాగ సరసమాడ బోయాన్రా ; కాని మాఆవిడి నేను సుక్కేసు గున్నానో, నాకు దెయ్యి మట్టిందో అని మూల వున్న సీపిరికట్టతో నన్ను సావ బాదిందిరా ! దాంతో వున్న వుబలాటం కాస్తా వూడిపోనాదిరా ! అదుగందు సేతే దొరలపద్దవతి మనకి సుతరామూ పనికిరా దంటాను.

మొదటివాఁడు :

[కడుపుఁబట్టుకొని నవ్వును.]

[వసంతసేనయు విక్రమార్కుఁడు నొక చిన్నసంచి . పట్టుకొని ప్రవేశింతురు.]

వసంతసేన :

[విక్రమార్కునిఁ జూచి] ఈదివ్యయాత్రలో నువ్వూ, నేనూ, భగవంతుడూను — ఇంకెవ్వరూ లేరు.

విక్రమార్కుఁడు :

ప్రేమ !

వసంతసేన :

ప్రేమా ?, ఈ త్రయమూ వొక్కటే.

విక్రమార్కుఁడు :

[సముద్రము వంకఁ జూచుచు] భయంకరమైన గాలీ, భయంకరమైన కెరటాలూ —

వసంతసేన :

మనం వున్న భయంకరమైన ఈప్రమాదావస్థ కంటె భయంకరమైనవా ?

విక్రమార్కుఁడు :

ఈ కెరటాలలో చిన్నపడవ లేవీ నిలవలేవు.

వసంతసేన :

మనం అనుభవిస్తోన్న క్రూరసంస్థలయొక్క దౌర్జన్యంలో ఏ పడవలు నిలుస్తాయి ?

విక్రమార్కుఁడు :

[ఆమె హస్తమును స్వీకరించి, యామెను దేరి పారఁ జూచుచు] వసంతసేనా ! త్వరగా నిశ్చయించు — అయ్యో ! మనం ఏర్పాటు చేసిన లాన్చీ రాలేదు ; ఈ తుపానుగాలిలో తీసుకు రాలేక

పోయారేమో. అదుగో స్టీమరు బయలుదేరడానికి సిద్ధంగా వుంది. ఫరవాలేదు; చేపలవాళ్ళ పడవ లున్నాయి. కాని చూడు, మనం హార్బరుకి వెళ్లేమంటే అశోకుడూ మిగిలిన వాళ్లూ చేసిన ఏర్పాటులవల్ల మనల్ని స్టీమరు ఎక్కకుండా చేస్తారు.

వసంతసేన :

ఏమి న్యాయం ఇది?

విక్రమార్కుడు :

ఈ ప్రపంచానికి న్యాయం అక్కరలేదు — నీభర్త దగ్గరనుంచి నువ్వు వెళ్ళడానికి వీల్లేదనో, లేక నిన్ను నేను తీసికెళ్ళడానికి వీల్లేదనో, ఏదోవొక విధమైన 'లా' లో వున్న 'సెక్షను' వుదాహరించి మనల్ని వెళ్ళకుండా అడ్డుపెట్టడానికి పోలీసు వారితోసహా సిద్ధంగా వున్నారు —

వసంతసేన :

ఆసంగతి నేనూ తెలుసుకున్నాను; అందుకనేకాదూ, ఇక్కడ ఓక పడవ ఎక్కి స్టీమర్ని మధ్యసముద్రంలో ఎక్కాలని వచ్చాం?

విక్రమార్కుడు :

ఔను. కాని నేను చెప్పే దేమిటంటే — సముద్రం అల్లకల్లోలంగా వుంది; ఇప్పుడు చిన్నపడవలో వెళ్ళడం చాలా అపాయం; హార్బరుకి వెళ్ళడాని కసలే వీలులేదు — అందుచేత నీ నిశ్చయ మేమి టని —

వసంతసేన :

[ చిరునవ్వుతో ] ఇదివరకే చెప్పేను కదూ! మార్పు ఎన్నటికీ లేదు.

విక్రమార్కుడు :

ప్రాణప్రియా! నాకు తెలుసును; కాని కొంచె మాలోచించు.

వసంతసేన :

ఏం. భయంగా వుందా, నీ ప్రాణం పోతుం దని?

విక్రమార్కుడు :

నావిషయం నాకేమీ భయం లేదు —

వసంతసేన :

ఇంక నావిషయమా? ప్రియా! నీ కా సందేహం ఎందుకు? — స్త్రీమరు చేరితే ఇక సుఖంగా వుంటాము; మన ప్రేమజీవనం అనంతంగా మహానందసముద్రంలో తేలిపోతుంది. ఒకవేళ స్త్రీమర్ని చేరలేకపోతే అంతకంటేదివ్యమైన లోకాలుచేరి శాశ్వతంగా ఇద్దరం ఏకమై పోయి ప్రేమారాధన, మహానందంతో చేసుకుంటాము. మనకి మరణమంటే ఇంక భయమెందుకు? ఎడబాటనేది లేనప్పుడు మనకేలోకం అయితేనేం? — నువ్వూ నేనూ అనేదిలేదు. "మనం" ఒక్కటే.

విక్రమార్కుడు :

ఈ మహాప్రేమకి నమస్కారం! [ఆమెచేయి విడిచి నమస్కరించును]. వసంతసేనా! చెలీ, నువ్వు చెప్పినది సత్యం — మనకి వియోగం లేనప్పుడు అన్నిలోకాలూ ఏకటే!

వసంతసేన :

మబ్బు గాఢంగా పడుతోంది. కాని, దూరాన్ని వున్న ఆ చుక్కని చూడు —

విక్రమార్కుఁడు :

అది వొక దివ్యలోకం —

వసంతసేన :

ఆ లోకంనుంచి ఆహ్వానం వస్తున్నట్టుంది! [అతని హస్తమును స్వీకరించును].

విక్రమార్కుఁడు :

మన ప్రేమని ఈలోకంభరించలేదు. మన ఉత్కృష్టభావాలు ఈ భూలోకంలో ఇమడవు.

[ఇరువురు నొక్కింతకాల మా నక్షత్రమువైపు చూతురు.]

విక్రమార్కుఁడు :

[తెలివి నొంది] ప్రేయసీ! నేను భావోద్వేగంచేత మరిచిపోయాను — స్టీమరు బయలుదేరింది. మనం పడవఎక్కి వెళ్లాలి. కాని, ఈ కెరటాలు చూడు; ఒకవేళ ఈవేళ కాగి ఇంకెక్కడైనా వుండి మరొక స్టీమరుమీద వెడదామా అంటే, అది లాభంలేదు — మనం తిరిగి వెనక్కి వెళ్లే మంటే ఏదో విధంగా మనల్ని కనిపెట్టి అనేకమైన అంతరాయాలు కల్పిస్తారు — అదుగో, నే ననుకున్నంత పనీ జరిగింది! మనం హార్బరుకి రాలేదని, ఈప్రాంతాలనుంచి వెదుతున్నామేమో అని అశోకు డిక్కడికి వస్తున్నాడు; అదుగో అతనికారు.

వసంతసేన :

నాకూ తెలుసును, వా ళ్లేదో విధంగా మనల్ని వెతుక్కుంటూ వస్తారని — నీవియోగం నేను భరించలేను ; ఆలస్యం వొద్దు ; రా, పడవ ఎక్కుదాం, నేను —

విక్రమార్కుడు :

అదుగో, పడవవాళ్లలా గున్నారు — [వారి నుద్దేశించి] ఎవరు మీరు ? పడవలో మమ్మల్ని త్వరగా స్టీమరు దగ్గరకి తీసుకుని వెళ్లాలి ; మంచిబహుమానం ఇస్తాను.

[నేపథ్య మంద్రిరవ్వురును లేచెదరు.]

రెండవవాడు :

అబ్బే, ఈళ్లేదు బాబూ — పడవ తిరగపడి పోద్ది.

విక్రమార్కుడు :

మీకు పుణ్య ముంటుంది. ఫరవా లేదు, రండి.

మొదటివాడు :

అయ్యగోరూ ! సచ్చిపోతాం, వొద్దండి బాబూ !

విక్రమార్కుడు :

ఇవిగో, ముందివి తీసుకోండి. [కొన్ని రూపాయల నోటులను వారి కిచ్చును.]

రెండవవాడు :

[అందుకొని] మా నిలువెత్తునా డబ్బేస్తామన్నా మాం రావొండి !

మొదటివాడు :

[రెండవవానితో] ఆ సొమ్మా మ్మారి కిచ్చెయ్యాసి.

విక్రమార్కుడు :

అయ్యో! — పోనీ, నేనే తీసుకు వెడతాను.

రెండవవాడు :

ఉంకో నోటెయ్యి బాబూ ; మాపడ విత్తాం తీసి కెళ్లొచ్చు.

మొదటివాడు :

ఓరి, నీ సిగతరగ !

విక్రమార్కుడు :

[చేపల వానికి నోటునిచ్చి] ప్రియా! రా, భయపడకు ; దైవ మున్నాడు. [ఆమెకుఁ గేలూఁత నొసఁగును.]

వసంతసేన :

[స్వీకరించి] నువ్వుంటే భయ మెందుకు? రా, త్వరగా పడ వెక్కుదాం — వా ళ్లెవరో వస్తున్నారు.

[ఇరువురును ముందుకు నడచెదరు.]

వసంతసేన :

నా కన్న నాన్నని వొకసారి చూడాలనుకొన్నాను. అయ్యో! ఇంకా రాలేదు ; వసుమతితో చెప్పేనుకూడాను ఇక్కడకి తీసుకురమ్మని — [ ఒక దీర్ఘనిశ్వాసము విడిచి ] ప్రియతమా! పద పోదాం —

విక్రమార్కుడు :

[ ప్రయత్న పూర్వకముగఁ గంటినీటి నాఁపుకొని ] రా.

[ ఇరువురును నిష్క్రమింతురు. ]

రెండవవాడు :

ఒరే, ఈళ్ళకి మతు లోయాయిరా.

మొదటివాఁడు :

పాపం, ఈళ్ళు స్త్రీమర్ని సేరలేరురా. [బిగ్గఱగా] బా బూ! ఎల్లకండి!

విక్రమార్కుఁడు :

[నేపథ్యమున] ప్రియా! జాగ్రత్తగా పట్టుకొని కూర్చో; నేను నడుపుతున్నాను.

వసంతసేన :

[నేపథ్యమున] ప్రాణప్రియా! నేను కొంచెం సహాయం చెయ్యనా?

విక్రమార్కుఁడు :

[నేపథ్యమున] అక్కర్లేదు; జాగ్రత్తగా మాత్రం కూర్చో.

మొదటివాఁడు :

అమ్మయ్యో! నావ బోల్తా పడిపోయిం దనుకున్నాన్రా.

విక్రమార్కుఁడు :

[నేపథ్యమున] భయపడకు.

వసంతసేన :

[నేపథ్యమున] భయం లేదు.

రెండవవాఁడు :

ఒరే, కొంచెం తగ్గిందిరా గాలి; కెరటాలు కూడా కొంచెం తగ్గేయి.

మొదటివాఁడు :

కాని, కొంచెం సేపట్లో గాలి మళ్లీ ఎక్కువౌతాడిరా. వానకూడా వస్తాది.

[ఐదారుసంవత్సరముల యీడుగల వాఁడగు వసంతసేనయొక్క కుమారునితో వసుమతి ప్రవేశించును.]

వసుమతి :

అమ్మో, ఎంత ప్రయత్నించినా ఆలస్యమైపోయింది. [బిగ్గఱగా] దేవీ! నీకొడుకుని తీసుకొచ్చాను.

కొడుకు :

అమ్మా!

వసంతసేన :

[నేపథ్యమున దూరమునుండి] ఆఁ — కనిపించావు, నాయనా! వసుమతీ! జాగ్రత్తగా ఇంటికి తీసికెళ్లు. నా నాయనని ముద్దు పె...[ మిగిలిన మాటలు వినఁబడవు. ]

కొడుకు :

అమ్మా, అమ్మా! [ ఏడ్చును. ]

వసుమతి :

[ఏడ్చుచు] నాయనా! వూరుకో.

కొడుకు :

అమ్మ ఎక్కడికో వెళ్ళి పోతోంది; అమ్మ కావాలి.

వసుమతి :

నాయనా! అమ్మ మళ్లీ ఇప్పుడే వస్తుం దమ్మా.

కొడుకు :

ఇం కెలా వస్తుంది? ఈ సముద్రంలో మునిగిపోతే ఇం కెలా వస్తుంది? [ఏడ్చును.]

వసుమతి :

[అతనిఁ గౌఁగిలించుకొని, కన్నీటితో] ఊరుకో, నాయనా! దేవు డున్నాడులే — భయపడకు.

[అశోకుఁడు ప్రవేశించును.]

అశోకుఁడు :

వసుమతీ! నేను వొద్దంటే నాకొడుకుని ఎందుకు తీసుకొచ్చావు? — వా ళ్లేరీ?

వసుమతి :

[మౌనముగా సముద్రమువైపు చేతితోఁ జూపును.]

అశోకుఁడు :

నన్ను తప్పించుకుని స్టీమర్ని మధ్యసముద్రంలో కలుసుకోవా లని ఈప్రయత్నం!

వసుమతి :

[తల నూఁపును.]

అశోకుఁడు :

నన్ను తప్పించుకుని పోవా లని ఎంత ప్రయత్నం! ఎలా మోసపుచ్చారు నన్ను? [కోపమునఁ బండ్లు గట్టిగ బిగఁబట్టి] ఈ తుపాను భీభత్సంలో సముద్రమధ్యాన్ని స్టీమర్ని కలుసుకోవడ మేమిటి — ఒకవేళ కలుసుకొంటారు నీటి అడుగున!—

వసుమతి :

స్టీమరు లేకపోతే దివ్యవిమానం వస్తుం దేమో! —

అశోకుఁడు :

[ఆమెను జూచుచు, వికటముగ] ఔను, నరకంలోనికి తీసు కెళ్ళ డానికి.

వసుమతి :

సామాన్యజీవి ఎన్నడూ పొందలేని దివ్యలోకానికి తీసు కెళ్ళడానికి.

అశోకుఁడు :

నీకు, వాళ్ళు చేసిన పని గొప్పవిషయ మనా ?

వసుమతి :

నిశ్చయంగా — లేకపోతే, ఇటువంటి మహాకార్యం ఎవరు చెయ్యగలరు ?

అశోకుఁడు :

ఓ, మహా గొప్పకార్యం !

వసుమతి :

ఔను. తుచ్ఛమైన మోహంతో రహస్యంగా ఎన్ని పనులు చేసినా తప్పులేదు — అందులోనూ ఆడది ఎటువంటి దివ్యమైన ప్రేమతో ఎటువంటి మహాకార్యంచేసినా అది వొక పెద్దతప్పు —

అశోకుఁడు :

[చకితుఁడై] నా కొడుకుని నా అనుమతి లేకుండా నా కారులో ఎక్కించి ఎందుకు తీసుకొచ్చావు ?

వసుమతి :

[సముద్రము వైపు చూపుచు] ఇతను ఆమెకొడుకు ముఖ్యంగా — తరవాత నీ కొడుకు.

[ఒక మెఱుపు మెఱయును.]

అశోకుఁడు :

గాలి ఎక్కువౌతోంది; వర్షంకూడా వచ్చేలాగుంది. ఇంక ఇతన్ని తీసుకెళ్ళిపో.

వసుమతి :

ఎక్కడికి ?

అశోకుఁడు :

ఇంటికి.

వసుమతి :

తల్లిలేని ఇంటికా ?

అశోకుఁడు :

[నిరుత్తరుఁడు]

కొడుకు :

నే నింకా కొంచెం సేపిక్కడుంటాను.

అశోకుఁడు :

ఇం కెందుకు ?

వసుమతి :

మెరుపు మెరిసినప్పుడు దూరా న్నుండయినా తల్లి కనిపిస్తుం దని.

అశోకుఁడు :

[మౌనము.]
[అందఱును వివిధభావములతో సముద్రముపైపు చూతురు. ఒక మెఱుపు.]

కొడుకు :

అమ్మా !

అశోకుఁడు :

ఇంక తీసుకెళ్లు.

వసుమతి :

ఏం, ఇంకో రెండు నిమిషాలు చూడకూడదూ ? — ఆ తరవాత —

వృద్ధసేవకుఁడు :

[ప్రవేశించి, యశోకునిఁ గాంచి] బాబూ ! పెద్దవాణ్ణి; తమ పాదాలు పట్టుకుంటాను; దేవి తిరిగి వచ్చేలాగ చెయ్యి. నాగుండె నీరైపోతోంది. [కుమారునిఁ గాంచి, సమీపించి, కౌఁగిలించుకొని యేడ్చును.]

వసుమతి :

ఊరుకో, అనవసరంగా చిన్నవాణ్ణి కలతపెట్టకు.

అశోకుఁడు :

నువ్వెందుకొచ్చావు ?

వృద్ధసేవకుఁడు :

కారులో కూర్చోలేకపోయాను ; ఎలాగైనా రప్పించు ప్రభూ !

వసుమతి :

మన మెంతప్రయత్నించినా వాళ్ళింక రారు. ఆ అవకాశం మించిపోయింది.

అశోకుఁడు :

[కోపముతో] అలాంటివాళ్లు మళ్లీ మనగృహం లోకా ?

వసుమతి :

ఔను, అలాంటివాళ్ళు మన మామూలు గృహాల్లోనే వుండ కూడదు; గృహాల్లే కాదు, ఈ లోకంసూడా వాళ్ళకి సరిపడదు.

వృద్ధసేవకుఁడు :

నా కేమీ తెలియదు, నాగుండె బ్రద్దలైపోతోంది.

వసుమతి :

మనగుండెలు వేయి బ్రద్దలైనా, ప్రపంచంలో వున్న అందరిగుండెలూ వొక్కసారిగా బ్రద్దలైనా ఏమీ ప్రయోజనం లేదిప్పుడు.

వృద్ధసేవకుఁడు :

[చేఁపలవాండ్రను జూచి] ఒరే, మీ రొక పడవ తీస్తారూ ?

చేఁపలవాండ్రిరువురును :

బాబూ ! మా తరంకాదు ! ఇలాంటి సముద్రంలో మాం ఎల్లలేం.

వృద్ధసేవకుఁడు :

మీ కెంతైనా ఇస్తాను.

చేపలవాండ్రు :

పిల్లలు కలోప్పమంచి — ఈ ప్లే దుంది, బాబూ !

వృద్ధసేవకుడు :

అయ్యో, రామా !

అశోకుడు :

అనవసరమైన గోల ఎందుకు ?

వసుమతి :

అనవసరమైన గోలా ? — అగ్ని పర్వతం బ్రద్ద లవుతోంటే గోల అక్కర్లేదూ ? ఏడుసముద్రాలూ ఒక్కసారిగా పొంగుతోంటే గోల అక్కర్లేదూ ? భూకంపం ప్రళయ కాలంలో సృష్టినంతా అల్లకల్లోలం చేస్తోంటే గోల అక్కర్లేదూ ?

అశోకుడు :

వసుమతీ ! ఏమిటి ఇలా మాట్లాడుతున్నావు ?

వసుమతి :

ఔను — ఏడవలేక ఇలా మాట్లాడుతున్నాను ; గుండె బ్రద్ద లవక ఇలా మాట్లాడుతున్నాను ; ఏమీ చెయ్య లేక ఇలా మాట్లాడుతున్నాను — [ఉద్రేకముచే కంపించును.]

అశోకుడు :

ఏమి టిది, పిచ్చిపట్టిందా, నీకు ?

వసుమతి :

పిచ్చిపట్టదూ ! — ఇంతమంది పిచ్చివాళ్ళు వున్న యీ ప్రపంచంలో — ఇలాంటిసమయంలో, మనుష్య స్వరూపం

అనేదే అసలు అంతరించి పోవలిసిందే — నక్షత్రా లన్నీ తమచోట్లనుంచి వూడిపోయి నశించి పోవలిసిందే — కాలం వొక్కమారు ఆగిపోవలసిందే — అదేమీ జరగకుండా యథా ప్రకారంగానే వున్నప్పుడు నాకు పిచ్చిఎత్తదూ! —

వృద్ధసేవకుఁడు :

వసుమతీ, కొంచెం శాంతం తెచ్చుకో.

వసుమతి :

నీకేం, నువ్వు చెబుతావు — నాబాధ నీకేం తెలుస్తుంది? నాహృదయంలోని మంట నీకేం తెలుసు? — శాంతమా! — శాంతం! — ప్రళయకాలంలో శాంతం ఏమిటి? అన్నీ మండి పోతోంటే శాంతం ఏమిటి? [సముద్రంలోఁ బ్రయాణము సేయుచున్న వారినిరువురను జూపి] అందరూ ఏకమై నలిపి వేస్తోంటే శాంతం ఏమిటి? నాకు సర్వస్వమైన నాదేవి నశించిపోతోంటే నాకింకా శాంతం ఏమిటి? - [ఏడ్చును].

కొడుకు :

[ఆమెను గాంచి, యేడ్చును.]

అశోకుఁడు :

[కొడుకును గాంచి] ఏడవకూడదు — ఊరుకో, ఇంటికి వెళ్ళవూ?

కొడుకు :

నే నిక్కడే వుంటాను — అమ్మ రానిదే ఇంటి కెందుకు?

వసుమతి :

ఉండనియ్యి కూడదూ? — తల్లి చచ్చిపోతోంటే ఆఖరు సారి చూడడానికైనా నోచుకోలేదూ?

[ఒక పెద్ద మెఱుపు.]

కొడుకు :

అమ్మా! అమ్మా! [ఏడ్చును.]

వృద్ధసేవకుఁడు :

శ్రీరామరక్ష!

వసుమతి :

ఊరుకో, నాయనా! — అయ్యయ్యో, గాలి విపరీతంగా వుంది; పడవ ఎక్కువసేపింక ఈ కెరటాలలో ఆగదు.

అశోకుఁడు :

[తదేకదృష్టితో నావైపు చూచుచుండును.]

[మఱల నొకతీవ్రమగు మెఱుపు.]

చేపలవాండ్రలో మొదటివాఁడు :

అయ్యో, తెడ్డు కెరటందెబ్బ కూడి పడిపోయింది!

రెండవవాఁడు :

స్త్రీమరు సేరువ కొస్తున్నాది కాని, ఈ రింక దాన్ని అసలే కలుసుకోలేరు.

వృద్ధసేవకుఁడు :

మహాసముద్రంలో పడవ అల్లల్లాడుతోంది.

వసుమతి :

మహాసముద్రంలో పడవ అల్లల్లాడుతోంది.

అశోకుఁడు :

వర్షం కూడా కొంచెం ప్రారంభం అవుతోంది —
[కొడుకును గాంచి] ఇంక వెడదాము, రా.

వసుమతి :

ఆకాశమైనా ఏడుస్తుందికాని మనుష్యుడి హృదయం కరగదు.

అశోకుఁడు :

వసుమతీ ! నీమాటల కర్థం లేనట్టుందే ఇంక ?

వసుమతి :

[విచారించుకొనక సముద్రమువైపు చూచుచుండును — చేఁపలవాండ్రను గాంచి] నాయన్లారా ! నాకు పడవ నడపడం రాదు ; మీాకు వెయ్యిరూపాయ లిస్తాను. నన్ను అక్కడికి [సముద్రము వైపు చూపుచు] తీసు కెళ్ళండి.

చేఁపలవాండ్రు :

అమ్మా ! మాతరం గాదు — ఏం లాబం లేదు.

వసుమతి :

పోనీ, నే నొకదాన్నే ప్రయత్నిస్తాను.

వృద్ధసేవకుఁడు :

వసుమతీ ! నీకు కొంచెమైనా చేతకాదు; ఏంలాభం ?

వసుమతి :

నేను వుండి మట్టుకు ఏంలాభం ?

వృద్ధసేవకుఁడు :

[కుమారుని వైపు చూపును.]

వసుమతి :

[చూచి] అవును — నాయనా ! చినుకులు పడు తున్నాయి —
[తనకొంగు నతని శిరముపైఁ గప్పును.]

[ఒక మెఱుపు.]

అశోకుఁడు :

[సముద్రముపైపు గనుచు] ఛీ, ఇలాంటి సమయంలో కూడా ఎలా వాళ్ళిద్దరూ...

వసుమతి :

ఇలాంటి సమయంలో కూడా ఇంకా తప్పా ?

రెండవవాఁడు :

[మొదటివానితో] ఒరే, సూడు, ఒకళ్ళ నొకళ్లెలాగ కరిసి పెట్టుకుని కూకున్నారో, పాపం.

మొదటివాఁడు :

ఇంత తుపానులో ఇం తెక్కువసేపు ఏదీ నిలవ లేదురా.

వృద్ధసేవకుఁడు :

ఈ కెరటాలలో ఏ నిముషం పడవ తిరగబడి పోతుందో చెప్పలేం.

కొడుకు :

వసుమతీ ! అమ్మ దగ్గరకి వెడతా — అమ్మకి భయం వేస్తుంది, పాపం.

వసుమతి :

[గద్గదికస్వరముతో, బుజ్జగించుచు ] నాయనా ! అమ్మ కేమీ భయం లే దమ్మా.

వృద్ధసేవకుఁడు :

ఇలాంటి మాటలు ఈ చెవులలో పడుతుంటే ఇంకా నే నెలా బ్రతికి వున్నానో?

[ఒక పెద్ద ఉఱుము.]

మొదటివాఁడు :

అమ్మో, పిడుగు!

వసుమతి :

లేదు, పిడుగు పడలేదు — ఎక్కడైనా పడితే నామీద పడాలి కాని ఇం కెక్కడా పడడానికి వీ ల్లేదే.

రెండవవాఁడు :

[మొదటివానితో] ఇదంతా నాకు కంగారుగా వుందిరా, వరసంకూడా ఎక్కువయ్యేలాగుంది, వాలతియ్యి, పోదాం.

మొదటివాఁడు :

నాకు వొళ్లంతా నీ రైపోతోందిరా; కాళ్లాడటం లేదు.

[ఒక తీవ్రతరమైన మెఱుపు — అందఱును సముద్రము వైపు చూచుచు, "అయ్యయ్యో, రామ! రామ!" అని యుచ్చరింతురు.]

కొడుకు :

అమ్మా! అమ్మా! [బిగ్గరగ నేడ్చును.]

అశోకుఁడు :

[ఆవైపునకే స్తబ్ధుడై చూచుచుండును.]

మొదటివాఁడు :

ఒక పెద్దకెరటం వాళ్ళని సందరంలో కలిపేసింది!

రెండవవాడు :

పడవ తిరగబడి పడింది, అద్దొస్తుంటే చేస్తే బోస్తు.

మొదటివాడు :

నా కాస నేదురా. ఇలాంటిసందర్భంలో కానా కష్టం.

రెండవవాడు :

నాకు పారిపోవాలని వుందిరా. నే నిక్కడుండలే నింక.

వృద్ధసేవకుడు :

[వణుకుచు] ఎలాంటిది ఎలాంటి స్థితికి వచ్చింది — ఎందుకు బ్రతికేను ఇన్నాళ్లు! — [కన్నులు తుడుచుకొనును.]

వసుమతి :

[వెఱ్ఱిదానివలె జూచుచు] ఈ నాటకంలోని ఈ అంకానికి విషాదాంతమైన ఈ భరతవాక్యమా! — ఇప్పుడు మనుష్య లోకానికి కళ్లు చల్లగా వున్నాయా! — [మోకరించి నమస్కరించి ప్రార్థించుచు] ఈశ్వరా! నువ్వే వున్నట్టయితే, వేరొక లోకం వున్నా లేకపోయినా వాళ్ళకోసమైనా ఇంకొక దివ్యలోకం సృష్టించి ఇరువురిని అక్కడ రక్షించు! — తప్పదు; లేకపోతే ఈ లోకానికీ, ఈ నక్షత్రాలకీ, ఈ సృష్టికీ, దేనికీ ఏమీ అర్థం లేదు — [లేచి యేడ్చుచున్న కుమారుని దగ్గఱకుదీసికొని] రా, నాయనా! వెడదాం; ఇక్కడ పనేముంది ఇంక మనకి! —

తెర.

సమాప్తము.